

మొదటి సంపుటి

యువభారతి సాహితీమిత్రుల
దసరా కథా సంకలనం


ప్రచురణ :




రిజిష్టర్డ్ నెం. 1/64

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

KATHA VAHINI - Volume 1
AN ANTHOLOGY OF STORIES
BY SAHITHIMITRAS OF YUVABHARATHI

యువభారతి

ప్రచురణ : 15

ప్రథమ ముద్రణ : 1,000 ప్రతులు
అక్టోబరు 7, 1973

ముఖపత్ర రచన :
శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :
విజయశ్రీ ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 500003.

కార్యాలయం :

యువభారతి
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001.

వెల : రెండు రూపాయలు.

# ప్రస్తావన



ఇది శరత్తు. ఎదఎదలో చైతన్యవిద్యుత్తులు పండించే సరిత్తు. ఈ శుభ సమయంలో 'కథావాహిని' ఉదయిస్తున్నది. యువభారతి సాహితీమిత్రుల కథాచైతన్యాన్ని ఈ కథావాహిని ఆవిష్కరిస్తున్నది. సాహితీమిత్రులు సహృదయ లోకానికి సమర్పిస్తున్న ద్వితీయ బహూకృతి ఇది. అంతేకాదు — యువభారతికి సాహితీమిత్రులతో ఏర్పడిన స్నేహబంధానికి అద్వితీయాక్షర కృతి ఇది. సాహితీమిత్ర సభ్యులలో ఇరవై మంది కథలను రెండు భాగాలుగా 'కథావాహిని' పేరుతో సాహితీలోకానికి సమర్పించుకోగల్గుతున్నందుకు సంతోషిస్తున్నాం.

సాహిత్యం జాతిలో చేతనాజ్యోతులను వెలిగిస్తుందని సమాజంలోని భిన్నభిన్న వ్యక్తులమధ్య, ఎన్నెన్నో కళాశక్తులమధ్య సామరస్యాన్నీ, సదవగాహననూ కలిగిస్తుందనే విశ్వాసంతో యువభారతి పదేళ్ళుగా పాటుబడుతున్నది. సమకాలీన సమాజాన్ని అందలి విలువలను పఠితృ ప్రపంచానికి పరిచయం చేయాలనే ధ్యేయంతో, ఉత్తమ సాహిత్యాన్ని వీలైనంత తక్కువ వెలకు సహృదయుల కందించాలనే అభిప్రాయంతో గతంతో యువభారతి రచనను ప్రచురించింది. విజ్ఞులచేత ఉపన్యాస లిప్పించి 'కావ్యలహరి' 'చైతన్యలహరి'గా రూపకల్పనచేసి రసికలోకానికి కానుకలుగా సమర్పించింది. 'మహతి'ని శతవ్యాససహితంచేసి తెలుగుల వెలుగు చేతుల్లో పెట్టింది. ఈ విధంగా సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తున్న సందర్భంలో ఎందరెందరో సాహితీప్రియులతో మాకు సన్నిహిత సంబంధ మేర్పడింది. ఈ సంబంధమే 'సాహితీమిత్ర' పథకంగా రూపురేఖలను దిద్దుకున్నది. ఈ విజయదశమికి సాహితీమిత్రులసంఖ్య దాదాపు మూడువేల ఐదువందలు. కనీసం పదివేలమంది సాహితీమిత్రులతో నైనా సంబంధసాన్నిహిత్యాలు పెంపొందించుకోవాలని ప్రయత్నిస్తున్నాం.

మా సాహితీమిత్రులలో కవులు, కథకులు, వక్తలు, చిత్రకళాది లలిత కళాయుక్తులూ ఉన్నారు. వీరిలో వైవిధ్యమున్నది. వైశారద్యమున్నది. కొందరికి

ప్రసిద్ధి ఉన్నది. మరికొందరికి ముందడుగు వేయాలనే ఉత్సాహమున్నది. వీరందరి రచనాశక్తులను సమీకరించాలని, దాగియున్న వారి ప్రతిభాప్రసూన పరిమళాన్ని పదిమందికీ పంచాలని సంకల్పించి ఈ ప్రమాదీచ ఉగాదికి తొలి ప్రయత్నంగా సాహితీమిత్రుల కవితాసంకలనం 'ఉషస్సు'తో స్వాగతం పలికాము. ఈ సందర్భంలోనే కథారచనా వ్యాసంగంలో అభిరుచిగల సాహితీ మిత్రులు కొందరు 'ఉషస్సు' పద్ధతిలో ఒక కథా సంకలనాన్నికూడ రూపొందించాలని సూచించారు. ద్విగుణీకృతమైన ఉత్సహాన్ని ప్రదర్శించారు. వారి ప్రోత్సాహాన్ని ప్రేరణగా అందుకొని మలిప్రయత్నంగా ఈ విజయదశమికి సాహితీమిత్రుల కథాసంకలనాన్ని వెలువరించాలని అనుకున్నాం. ప్రయత్నించాం. ఆ సంకల్ప కృషి ఫలితమే ఈ 'కథావాహిని'. సాహితీమిత్రుల హృదయశిఖరాలలో ఉదయించి కదలివచ్చిన ప్రతిభాసుధావాహిని. ఈ రకంగా యువభారతికి సాహితీమిత్రులతోగల సాహితీ బాంధవ్యానికి ఈ 'కథావాహిని' సంకలనాలు సరసవర్ణ సంకేతాలు.

ఈ విజయదశమి కథాసంకలనోద్దేశాన్ని ఉగాది కార్యక్రమ సందర్భంలోనే ప్రకటించాం. దాదాపు 65 మంది సాహితీమిత్రులు పాల్గొన్నారు. వచ్చిన దానిలో మేమిదివరకే సూచించినమేరకు – మేలైనవిగా కనిపించిన ఇరవై కథలను, పదేసిచొప్పున రెండు భాగాలుగా 'కథావాహిని' పేరుతో సాహిత్య లోకానికి విజయదశమి కానుకగా అందిస్తున్నాం.

ఉగాది కానుకగా—సాహితీమిత్రుల తొలి ప్రచురణగా 'ఉషస్సు' కవితా సంకలనాన్ని వెలువరించినప్పుడు విమర్శకులు ఎన్నో విసుర్లు విసిరారు. వెలుగుచూడని రచనలకు విస్తృత వేదికనేర్పాటు చేయడంకోసం–అందరికీ తెలిసినవారినేగాక అజ్ఞాతంగానున్న ప్రజ్ఞామూర్తులను పరిచయం చేయడం కోసం–ఉషస్సును వెలువరిస్తున్నామని 'ఉషస్సు' ప్రస్తావనలో తెలిపినా కొందరు సహృదయులు మమ్మల్ని అర్థంచేసికొనలేదు. నిశితంగా, నిర్దాక్షిణ్యంగా నిందించారు. రాశియేగాని వాసిలేదని, రచనల్లో రమ్యతలేదని, కసిగా కలంలోని బలాన్ని ప్రదర్శించారు. అయినా మేమేమీ అనుకోలేదు. అనుకోంగూడా. దీనికి కారణం–సాహితీమిత్రుల ప్రతిభాప్రదర్శనకు యువభారతి వేదికగా–ప్రాతిపదికగా కలిగిస్తున్న అవకాశం అభిలషణీయమనే ఆలోచన మరింత బలంగా కలగడమే. దీనికితోడుగా సహృదయలోకం మా వెన్నుతట్టి నిలిచి

హర్షపూర్వకంగా తన సౌముఖ్యాన్నీ–సహకారాన్నీ వర్షించడమే. ఈ విధంగా ఒకవైపు నిశితంగా వచ్చిన నిందలను–మరోవైపు ఆదరాభిమానాలతో వచ్చే అభినందనలను హృదయపూర్వకంగా అందుకున్నామేగాని అతిశయోక్తిగా నేలనువిడిచి నింగినందుకోలేదు. పేరుమోసిన మహా కవుల తొలిరచనలను పరిశీలిస్తే సుప్తమైయున్న కళాబీజాలను అంకురింపజేయాలనే సాహిత్యోద్యమాసక్తియే తప్ప అచ్చువోసిన ప్రత్యక్షరం మహాకవిత్వపు పోహళింపుతో ఘుమఘుమలాడుతుందని మా విశ్వాసం కాదు. సరికొత్త పద్ధతులతో సాహిత్యోద్యమాన్ని నిర్వహిస్తున్న యువభారతి అభినవగమనానికి ఈ విమర్శలు అంతగా చేయూత నివ్వలేకపోతున్నాయనే మా ప్రత్యయం.

గతంలో అనుభవాలు నేర్పిన పాఠాలను దృష్టిలోనుంచుకొని కొన్ని నిబంధన లేర్పరచి, పరిశీలించి సరసమైన ఇరవై కథలను మాత్రమే ఎన్నిక చేసి, మరో అడుగు ముందుకు బలంగా–సహృదయులైన సాహితీమిత్రులు సాహిత్య మర్మజ్ఞులు అనుక్షణం అందించే సహకారఫలంగా–యువభారతి తన దశమ వార్షికోత్సవాల శుభవేళ ఈ 'కథావాహిని'ని సమర్పిస్తున్నది. సరస పఠితృలోకం ఈ కథాసాహితిని ఆదరిస్తుందని ఆశిస్తున్నది. ఈ ఆశయం నిజమైతే–ప్రయోజనవంతమని ఋజువైతే–సాహితీమిత్రులతోడి మైత్రిని మరింత సంపన్నం చేసికోవాలని, వారి సాయంతో ధ్యేయాన్ని చేరుకోవాలని కోరుకుంటున్నాం.

ఈ విజయదశమినాడు ఈ 'కథావాహిని'తోపాటు యువభారతీయుల కథా సంకలనం 'ఉదయా'న్ని తమ కరకమలాలతో ఆవిష్కరించడానికి సౌహార్దంతో సమ్మతించిన సౌజన్యమూర్తులు, సుప్రసిద్ధ పాత్రికేయులు శ్రీ రావూరు వెంకట సత్యనారాయణగారికి, ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన సాహితీ బంధువులు ఆచార్య డా॥ బి. ఆర్. శాస్త్రిగారికి, ముఖ్యఅతిధులుగా విచ్చేసి ఆశీస్సులందించిన సరసహృదయులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి మా హార్ధికాభివందనాలు.

ఈ 'కథావాహిని'లోని రచనలను ప్రత్యక్షరం పరిశీలించి, పరిశ్రమించి కథల్ని ఎన్నికచేసి ప్రచురణలో తోడ్పడడమేగాక ముఖపత్రాన్నికూడ ముద్దుగా తీర్చిదిద్దిన కథా, కవితా చిత్రికళాది బహుముఖ ప్రతిభాశాలురు, యువభారతి గౌరవ సభ్యులు అయిన శ్రీ శీలా వీర్రాజుగారికి మే మెంత ఋణపడియున్నామో మాటల్లో చెప్పలేం.

ఈ సంకలనంలో ప్రచురించడానికి తమ కథలను అందించి అన్నివిధాలా సహకరించిన, కథావాహిని రచయితల సౌహార్దానికీ, ఔదార్యానికీ మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

కథాసంకలన ప్రచురణను పర్యవేక్షించిన గౌరవ సభ్యులు, ప్రధాన సంపాదకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి మా ధన్యవాదాలు.

యువభారతి కార్యాలయంలో సకలవిధాలా మాకు సాయపడి ప్రచురణను సుకరంచేసిన మిత్రులు శ్రీ రాధాకృష్ణమూర్తిగారికి కృతజ్ఞతలు.

ఈ సంకలన ముద్రణలో భద్రస్థానం వహించిన యువభారతి సమావేశకర్త శ్రీ టి. కె. విజయకుమార్‌గారి సహకారాన్ని ఎన్నడూ మరచిపోలేం.

కథావాహిని ముఖపత్రాన్ని అచ్చొత్తిన విస్టాన్ ప్రింటర్సువారికి, సకాలానికి కథాసంకలనాన్ని అచ్చువోసిన విజయశ్రీ ప్రింటింగు వర్క్సు, శ్రీ ఎ. సూర్యనారాయణగారికి కృతజ్ఞతాబద్ధులం.

సాహితీ చైతన్యంతో సాహితీమిత్రుల సహకార సౌజన్యాలు చేయూతగా 'కథావాహిని'వంటి విజయదశమి కార్యక్రమాలు నిర్వహిస్తూ ఇంకా ముందుకు సాగిపోవాలనుకున్న యువభారతికి సహృదయలోకం సముచితాదరాభిమానాలను అందిస్తుందని తద్వారా సాహిత్యసమున్మీలనానికి సహకరిస్తుందని ఆశిస్తున్నాం.

విజయదశమి
6-10-1973

తిరుమల శ్రీనివాసాచార్యులు
విశ్వనాథ సూర్యనారాయణ
యువభారతి

# కథాలాపం



కథానికా ప్రక్రియ యితర భాషా సాహిత్యాలలోవలె తెలుగు సాహిత్యంలో కూడా బాగా ప్రచారంలోకి వచ్చింది. ఈనాడు కథల పేరుచెప్పుకుని ఎన్నో పత్రికలు ఊపిరి పోసుకుంటున్నాయి. ఎందరెందరో దానిమీద ఆధారపడి బ్రతుకుతున్నారు. చాలామంది దీనిని వ్యాపారంగా చేసుకుని లాభిస్తున్నారు—ఒక్క రచయిత తప్ప. ఇప్పుడు తెలుగు కథ అక్షరజ్ఞానంవున్న ప్రతి తెలుగు గడపా తొక్కే స్థితికి వచ్చింది. వెళ్ళి, తిష్టవేసుకునే స్థితిలో ఉన్నా లేకున్నా కనీసం చుట్టపు చూపుగానైనా వెళ్ళి పలకరించి వస్తోంది. తెలుగు కథ యీ స్థితికి చేరడం ఎంతగానో హర్షించదగ్గ విషయం.

అయితే యింతమాత్రంచేత తెలుగు గడప బాగా అభివృద్ధి చెందిందని మురిసిపోడానికి వీల్లేదు. ఇది కేవలం తెలుగు కథకుగల ప్రాచుర్యాన్ని మాత్రమే తెలుపుతోంది. ప్రచారం వేరు, ప్రతిభవేరు. రాశినిబట్టి గుణాన్ని లెక్కించడానికి వీల్లేదు. పదిమందిదగ్గరకి తెలుగుకథ వెళ్ళగలిగిందంటే దానికి ఎన్నో కారణాలు వుండొచ్చు. ప్రజల్లో అక్షరజ్ఞానం పెరగడంవల్ల కావచ్చు. పత్రికలు కొనడం ఒక రకమైన స్టేటస్‌గా భావించడంవల్లకావచ్చు. ఇది మంచి కాలక్షేపం అనిపించడంవల్ల కావచ్చు. ఏదిఏమైనా ముందు ముందైనా సంఖ్యతోపాటు గుణంలోనూ తెలుగుకథ ఎదగడానికి అనువైన వాతావరణాన్ని యిది సృష్టించడానికి తోడ్పడగలదని ఆశిద్దాం.

తెలుగుదేశంలో కథకులకు కొరతలేదు. ఏటా ఉత్పత్తి అవుతోన్న కథల సంఖ్య చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. అచ్చయినవి లెక్కపెట్టాలంటేనే కష్టం. కానివికూడా లెక్కలోకి తీసుకుంటే మరిక చెప్పనే అక్కరలేదు. నిజానికి, తయారవుతోన్న తెలుగు కథలకు తగినంత ఔట్‌లెట్ లేదనే చెప్పాలి.

తెలుగు మాటాడే జనాభాతో పోల్చితే మనకున్న తెలుగు పత్రికలు

చాలవు. అందువల్ల చాలామంది ప్రోత్సాహిక రచయితలు వెలుగులోకి రాలేక పోతున్నారు. తమ ప్రతిభని ప్రదర్శించే మార్గంలేక నీరుగారి పోతున్నారు.

ఈనాడు కథకు మంచి గిరాకీ వుందని అంతా అంటున్నారు. పత్రికలు కథలమీదే జీవిస్తున్నాయి. కథల్ని ప్రచురించి ప్రజల్ని ఆకట్టుకుంటున్నాయి. ఈ నాటి కథ చాలామంది దగ్గరకు వెళుతోంది. అన్ని రకాలవారూ చదువు తున్నారు. ఇంతమాత్రంచేత తెలుగు కథకు గిరాకీ పెరిగిందనుకోవడం వట్టి భ్రమ.

ఉన్న సాహిత్య ప్రక్రియల్లో యీనాడు అన్నిటికన్న ఎక్కువగా వుత్పత్తి అవుతోన్న ప్రక్రియ—కథ. ఎక్కువమంది రాస్తున్నారు. ఎక్కువగా ఉత్పత్తి అవుతోంది. చదివేవాళ్ళూ ఎక్కువే. అయినా కథల సంపుటికి అమ్మకాలులేవు. ఇంత విరివిగా ఆదరింప బడుతోన్న కథకి మేగజైనులో తప్ప పుస్తకరూపంలో ఆదరణ లేదు. కథాసంపుటాలు ఏమూలో మూలుగుతుంటాయి. ప్రచురణ కర్తలు కథాసంపుటాల్ని అచ్చువేయడానికి ముందుకు రారు. నవలల కున్న గిరాకీ కథలకు లేదు. తెలుగు కథ బాగా అభివృద్ధి పొందిందనీ, దీనికి గిరాకీ పెరిగిందనీ అనుకోవడంలో నిజంలేదు.

తెలుగు రచయితకు తన కథ అచ్చయితే వచ్చే ప్రతిఫలం అచ్చయిన ఓ కాపీ మాత్రమే. డబ్బిచ్చే పత్రికల్ని వేళ్ళమీద లెక్కెట్టొచ్చు. ఇచ్చే పత్రికలు కూడా అంతంత మాత్రంగానే యిస్తున్నాయి.

ఈనాడు తెలుగు కథాసంపుటాలకు ప్రచురణకర్తలు లేక రచయితలే స్వయంగా అచ్చు వేసుకోవలసి వస్తోంది. వాటికి అమ్మకాలుండవు. పెట్టిన పెట్టుబడి రాదు. అప్పుచేసో, సంపాదనలో ఏదోవిధంగా సర్దుబాటు చేసుకునో స్వయంగా తనే పుస్తకం వేసుకుంటే నష్టమేకాని లాభం వుండదు. అందుకని ప్రచురణకర్తల కాళ్ళా వేళ్ళాపడి యాభయ్యో వందో కాపీలు యిస్తే చాలని ఒప్పించి అచ్చు వేయించుకోక తప్పడంలేదు. కొందరు పదిమందీ కలిసి తలా కొంత డబ్బు వేసుకుని తమ కథల్ని పుస్తకానికి ఎక్కిస్తున్నారు.

ఈ కథల సంపుటి అటువంటిదే.

యువభారతి సంస్థ పెద్దఎత్తున సాహిత్య కార్యక్రమాలను నిర్వహించడంలో విపరీతంగా సాహితీకృషి కొనసాగించడంలో విశేషంగా తమ సహాయ

సహకారాలను అందజేస్తున్న సాహితీమిత్రులు చాలామంది వున్నారు. వీరిలో సృజనాత్మక శక్తికి కొదవలేదు. చొరవలేకపోవడంవల్లా, అవకాశాలు లేకపోవడంవల్లా వీరిలో అంతర్గతంగావున్న యీ ప్రతిభ లోలోపలే అణగారిపోతోంది. వీరిలోవున్న యీ ప్రతిభని బయటికితీసి నలుగురిముందూ పెట్టే ఉద్దేశంతో యువభారతి తమకు సహాయపడుతోన్న సాహితీమిత్రుల కథలను సేకరించి, మేలైనవి ఎన్నికచేసి 'కథావాహిని' పేరుతో రెండు సంపుటాలుగా ప్రచురిస్తోంది. సగం ఖర్చు రచయితలు భరించగా మిగతా సగం యువభారతి భరిస్తోంది.

ఇందులోని రచయితల్లో ఒకరిద్దరు పాఠకులకు సుపరిచితులు. మిగిలినవారు కొత్తవారు. ప్రసిద్ధ తెలుగు కథకుల సరసన వీరు నిలబడలేక పోవచ్చు. కాని బహుళ ప్రచారంపొందిన చాలామంది రచయితల కథలపక్కన యీ కథలు నిలబడగలవని నా నమ్మకం. ఈనాడు పత్రికల్లో అచ్చవుతోన్న కథల స్థాయికి యివి సరితూగగలవనే నా విశ్వాసం.

వీరిలో చాలామంది యిప్పుడిప్పుడే అడుగులు వేస్తున్నారు. వీరి దృష్టంతా యిప్పుడు పడిపోకుండా బేలన్సుకాసుకుంటూ అడుగుతర్వాత అడుగు వేయడంమీదే నిలచివుంటుంది. తూలిపోకుండా నిలదొక్కుకుని నడవడం అలవాటయ్యాక ఎవరిదారి వారు వెతుక్కుంటారు. అప్పుడు తమ మార్గాలేమిటో స్పష్టమైన అవగాహన వారికి ఏర్పడుతుంది.

ఈ కథకులు తమ యీ ప్రతిభకు మరింత మెరుగులు దిద్దుకుని, నిరంతరంగా కృషిచేస్తూ ముందుముందు చక్కటి రచయితలుగా నిలబడగలరని ఆశిస్తున్నాను.

—శీలా వీర్రాజు



# సాహితీమిత్రులు
## ✽ యువభారతి




స్పందనం జీవలక్షణం।
రసస్పందనం సహృదయలక్షణం।
రసహృదయం సాహిత్యానికి జీవనం।

మా కృషిలో పాలుపంచుకునేందుకై సహృదయులయిన సాహిత్యాభిమానులకు అందిస్తున్న ఆహ్వానం 'సాహితీమిత్ర'. జాతి పురోగమనానికి సాహిత్యవికాసం, దాని ప్రభావం అవసరమని భావిస్తూ ఉత్తమ సాహిత్య ప్రచురణానికి యథాశక్తి ప్రయత్నిస్తున్నాము. 'సాహితీమిత్రులుగా చేరడం అంటే మీ సహాయ సహకారాలను మా సాహిత్యకృషికి అందించటానికి ఒప్పుకుంటున్నారన్నమాట। యువభారతి సాహితీమిత్రులుగా చేరడంవల్ల సమకూరే సదుపాయాలు :

- ప్రతి సంవత్సరం ఐదు రూపాయలు చెల్లించడంతో, చేరిననాటినుండి ఒక సంవత్సరంపాటు యువభారతి సాహితీమిత్రులుగా పరిగణింప బడతారు.
- తక్షణమే ఒక ఉచిత పుస్తకం.
- 1-12-73 లోగా చేరేవారికి 1973 వ సంవత్సరంలో, మూడు రూపాయల ప్రచురణ పూర్వ విరాళంపై ప్రచురింపబడే వికాసలహరి ఉచితంగా అందుతుంది. నేరుగా అందించడంగాని-పోస్టుద్వారా పంపడంగాని జరుగుతుంది.
- 2-12-73 తరువాత చేరేవారికి 1974 లో ప్రచురించనున్న లహరి అందించబడుతుంది.
- యువభారతి ప్రచురించే, కవితాసంకలనం, కథానికా సంకలనాలలో పాల్గొనే అవకాశం ఉంటుంది.
- యువభారతి మిగిలిన ప్రచురణలను 25% మినహాయింపుతో సొంతం చేసుకునే సదుపాయం మీరు చేరిననాటినుండి ఒక సంవత్సరంపాటు ఉంటుంది.
- యువభారతి సమావేశాలలో మీరు సాహితీమిత్రులుగా, అతిథులుగా పాల్గొనవచ్చును.
- అన్నింటికన్న మిన్న యువభారతికి తోడ్పడగలుగుతున్నామన్న సంతృప్తి: మీకా సంతృప్తి కలిగించేలా యువభారతిని తీర్చిదిద్దడంలో మీ సహకారం అందించటం.

సాహితీవాహినిలో
మొదటి తరంగం

# మందార మకరందాలు

***************************************************************

# సా హి తీ వా హి ని

సమాజంలో సాహితీచైతన్యాన్ని నవనవోన్మేషంగా వికసింపచేయాలని యువభారతి లక్ష్యం. గతంలోని మంచిని ప్రపంచిస్తూ వర్తమానంలోని కర్తవ్యాన్ని ప్రబోధించేలా ప్రచురణ కార్యక్రమాన్ని రూపొందించటం యువభారతి అభిమతం. ప్రసిద్ధ తెలుగుసాహిత్యంలోని సౌందర్యం ప్రజావాహినికి ప్రత్యక్షమయ్యేలా రూపొందించిన ప్రచురణ కార్యక్రమం 'సాహితీవాహిని' ఒక మహాకవి కవితా వ్యక్తిత్వాన్ని కవితాత్మగల మరొక వ్యాఖ్యాత కమనీయశైలిలో రమణీయ వ్యాఖ్యతో ప్రజానీకానికందించటం ఈ కార్యక్రమ స్వరూపం. రంగురంగుల ముఖచిత్రంతో అందమైన గెటప్పుతో ముగ్ధమోహనంగా ప్రచురింపబడే సాహితీవాహిని ప్రతి తరంగాన్నీ ప్రతి పఠితకూ ఒక్క రూపాయికే అందించటం యువభారతి ప్రయత్నం.

భాగవత మకరందాన్ని ప్రజానీకానికి భక్తిరసాయనంగా అందించిన బమ్మెర పోతన తెలుగులో ప్రసిద్ధ కవి. ఆయన పద్యాలు తెలుగు వాక్కులకు తియ్యని ఆమెతలు. కొన్ని పద్యాలు తెలుగులో నిలిచిన సామెతలు. తెలుగు తియ్యందనాలు జాలువారిన కొన్ని పోతన పద్యాలకు డా॥ సి. నారాయణరెడ్డిగారి కమనీయ వ్యాఖ్యతో వెలువడుతున్న మొదటి తరంగం 'మందారమకరందాలు'.

మానవతావాదానికి మహామేరువుగా నిలచి నిర్మొగమాటంగా జాతిలోని తెలుపునలుపుల్ని తేటతెలుగులో సమీక్షించి, ప్రజాహృదయాల్లో శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్న వేమన, కవితామూర్తిని రసార్ద్రమైన ఆరుద్ర వ్యాఖ్యానంతో పరిచయంచేసే 'వేమన్న వేదం' సాహితీవాహినిలో రెండవ తరంగం.

సాహితీవాహిని ప్రజానీకంలో ప్రాచుర్యం చెందాలనీ, ప్రతి యింటా ఈ సాహితీ తరంగం ప్రసారంకావాలనీ, ప్రతి తరంగం దాని మాధుర్యాన్ని ఆస్వాదించాలనీ మనసారా ఆహ్వానించాలనీ—యువభారతి అభిలషిస్తున్నది.

***************************************************************

సాహితీవాహినిలో
రెండవ తరంగం

# వేమన్న వేదం

# అనుక్రమణిక

# తెరవెనుక

మాష్టర్ రవి

ఆ వార్త అబద్ధమని ఎలా అనుకోను? ఎదురుగా టేబిల్‌మీద మాధవి రాసిన ఉత్తరం గాలికి గిలగిలా కొట్టుకొంటుంటే, అందులో అక్షరాలు నన్ను ఒక్కసారి మాధవిముందు వాలమని గోలచేస్తుంటే — ఎలా కాదనుకోను?

ఎప్పుడూ చిలిపి అల్లరితో, ఎంతమందిలోవున్నా తన ప్రత్యేకతను నిలుపుకుంటూ, తుళ్ళుతూ గెంతుతూ, హుషారుగా తిరిగే భారతి 'ఇకలేదు' అనుకోడం నాతరం కావడంలేదు. దాన్ని చూసినప్పుడల్లా — 'ఇది జీవితంలో చాలా గొప్పవ్యక్తి ఔతుంది' అని అనిపించేది.

'ఒసేయ్ ఇందిరాగాంధీ తర్వాత ఈ దేశాన్ని ఏలే బాధ్యత నీదేనే. తెలుగు వాళ్లు దేశానికి అధ్యక్షులుగా ఓ వెలుగు వెలిగారు. ప్రధానమంత్రిగారుకూడా తెలుగువాడే ఐతే ఇక మన ఆనందానికి అవధులుండవ్. అందునా ఆ పదవికి వరువడి దిద్దిన స్త్రీమూర్తి ఇందిరమ్మలా నువ్వే ఐతే....'

'....పొండర్రా మీరూ మీ అల్లరీను. నా ఇష్టంవచ్చినంత గొప్పదా న్నౌతాను. అప్పుడు మీ అందరికీ ఏవో చిల్లరఉద్యోగాలు ఇవ్వకపోను' ఇదీ దాని జవాబు.

అది ఎంత చక్కనిబొమ్మలు వేసేదని! ఎంత భావగర్భితంగా వుండేవని ఆ బొమ్మలు! ఇక గంటలతరబడి ఏ విషయంమీదనైనాసరే అనర్గళంగా సోదా హరణంగా అది మాట్లాడుతుంటే ఎంతటివాళ్ళయినాసరే చెవులు రిక్కించి వినాల్సిందే. ఇన్ని కళల్లో ఆరితేరిన భారతి, పాతికేళ్లు నిండకుండానే, ఇలా వెళ్ళిపోతుందని ఎవరూ వూహించలేదు. భవిష్యత్తులో, దానిగురించి అనేక గొప్ప విషయాలు వింటానని ఆశించిన నేను ఈ వార్తతో పాతాళానికి కుంగిపోయాను. ఇంట్లో ఒక్కనిమిషం ఉండబుద్ధి పుట్టలేదు. వెంటనే బయలుదేరాను విశాఖ పట్నం మాధవిదగ్గరికి.

◆ ◆ ◆

మాధవి, నేను, భారతి ముగ్గురం చిన్నప్పటినుంచీ ఒక్కచోట పెరిగాం. చదువుకున్నాం. ఎక్కడి కెళ్ళినా ముగ్గురం కలిసి వెళ్ళేవాళ్ళం. మాకు 'త్రిమూర్తులు' అనే బిరుదుకూడా ఇచ్చి సత్కరించింది మగవిద్యార్థిబృందం. భారతి

బ్రహ్మట, మాధవి విష్ణట, ఇహ సరేసరి ఎప్పుడూ మటమటలాడుతూండే నేను ఈశ్వరుడనట.

భారతి నాన్నగారు బ్రహ్మానందం మంచి రచయిత. ఆ రోజుల్లో భావ కవులకోవలో ఎప్పుడూ ముందు నిలిచేవారు. పాతికేళ్ళకే ఆయన ఆంధ్రదేశంలో మంచి పేరున్న రచయితగా స్థిరపడిపోయారు.

కొందర్ని దురదృష్టం వెంటాడుతూంటుంది. భారతికి ఐదోఏడు రాకుండానే తల్లి దూరమైపోయింది. అంత చిన్నవయస్సులో, భార్యా వియోగంతో, బ్రహ్మానందంగారు తల్లీ తండ్రీ తానేఐ భారతిని కంటికి రెప్పలా పెంచారు. తలిదండ్రులిద్దరూ అందగాళ్లు కావటంతో భారతికూడా ఎంతో అందంగా, బొద్దుగా ముద్దులు మూటగట్టుతూండేది.

రచయితకి ఇన్స్పిరేషన్ కావాలి అనేమాట నిజమే ఐతే, బ్రహ్మానందం గారికి అది కావల్సినంత దొరికింది. భార్య మరణం అతనిలో విపరీతమైన సంచలనాన్ని, బాధని, విరహాన్నీ కలిగించింది. తల్లిలేని దీనఐన భారతి పరిస్థితి నిమిష నిమిషం ఆయనలో సంఘర్షణ కలుగచేసింది. ఆమె పసితనపు చిలిపి ప్రవర్తనలు అతనిలోని రచయితను ఉత్తేజపరిచాయ్. ఆయనలో రచనాస్రవంతి కట్టలు తెంచుకొని పరుగులు తీసింది. పుంఖానుపుంఖాలుగా ఆయన రచనలు దేశంలో మారుమోగాయ్.

భారతి పదహారవయేట పున్నమచంద్రునిలా మెరిసిపోతూండేది. ఆమెలో యౌవ్వనం పాలపొంగులా ప్రవహించింది. కళ్ళల్లో దేనికోసమో అన్వేషణ, ప్రతి విషయంలోనూ విపరీతమైన ఆసక్తి కనబడుతూండేది. అది చదవని నవల లేదు. దానికి తెలియని విషయం లేదు. దేశదేశాల రచనలూ దాని నాలుక కొసని వుండేవి.

కొందరు ఆధునిక ప్రబుద్ధుల్లాగ దానికి మన పురాణవిషయాలంటే చులకన భావం లేదు. 'తెలుసుకునేటందుకు శక్తిచాలక, చదవడానికి ఓపికలేక వాటిని తూలనాడ్డంతప్ప, చాలామందికి వాటి విలువేం తెలుసుననీ-' అనేది.

మాధవి స్కూలుఫైనల్ అయాక పెళ్ళి చేసుకుని గృహిణైపోయింది. నేను బి. ఎ. అయాక, ఆర్థిక ఇబ్బందుల కారణంగా ఉద్యోగంలో చేరి, దేశాటన మొదలుపెట్టాను. భారతిమాత్రం ఎమ్. ఏ. పూర్తిచేసింది. దాన్లో అన్నీ బావున్నాయిగానీ, ఒక్క ఉత్తరంముక్క రాసేదికాదు. కనిపిస్తేమాత్రం, కన్నీళ్ళతో ఉక్కిరిబిక్కిరై ఎముకలు విరిగిపోయేలా కౌగలించేసుకుని, ఒక్క నిమిషం వదిలిపెట్టకుండా కూడాతిరిగి ఎన్నెన్నో విషయాలు మాట్లాడేది.

వెళ్ళిపోతానన్న రోజుకి ఎప్పుడూ వెళ్ళనిచ్చేది కాదు. 'రేపున్నావంటే మంచి బొమ్మ రాసిస్తాను-' అని ఆశపెట్టి, ఆ రోజు మరో రోజుచేసి, వెళ్ళేప్పుడు ఓ మంచి బొమ్మలు రెండు ప్రెజెంట్ చేసేది.

నా గదిలో అది ఓ సారిచ్చిన బొమ్మలు ఈవరకూ వింతవింత రంగులతో మెరిసిపోతూనే వున్నాయి. అందులో విషయాలు నా కింతవరకూ బోధపడి చావలేదు. ఆ భావం ఏమిటో, అది విడమర్చిచెప్పినా, నాకేం అర్థంకాలేదు. ఏమో ఆ నిమిషానికి బోధపడినట్టు తోచినా, వెంటనే మరచిపోయే మనస్తత్వం నాది.

అది రాసిచ్చిన ఒక బొమ్మపేరు సృష్టి. అందులో ఆకులు కప్పుకున్న ఇద్దరు స్త్రీ పురుషులు దగ్గరగా నిల్చున్నారు. వాళ్ళ కాళ్ళదగ్గర వేలాది ఆడామగా చుట్టుకొని వున్నారు. వెనక చెదిరిపోయే ఎరుపు, నీలంరంగులు వేసి వున్నాయి. మరో బొమ్మపేరు ఒకరినుండి ఒకరు. అందులో ఎందరో అందమైన స్త్రీ పురుషులు వివిధ వయసులవారున్నారు. ఒకళ్ళ కడుపుల్లోంచి ఇంకొకరు తొంగి చూస్తున్నారు. ఒకరి కౌగిలిలో వేరొకరు ఇమిడి పోతున్నారు. దూరంగా సూర్యుడు, చంద్రుడు ఒకేసారి ఆకాశంలో వెలిగిపోతున్నారు. సూర్యుడుచుట్టూ రక్తవర్ణం, చంద్రుడి చుట్టూ నీలమేఘశ్యాముని వర్ణంవేసి వున్నాయి.

ఇవి ఇస్తూ అదేదో చాలా పెద్ద లెక్చరే ఇచ్చింది. అంత బుర్రా ! నాకు అవి అర్థం చేసుకుందుకి ?

♦ ♦ ♦

బాబిగాణ్ని వాళ్ళ నాన్నపక్కలో పడుకోబెట్టి-ఈ రాత్రికి వీడ్ని జాగ్రత్తగా చూసుకోండి, నేనూ రాధా డాబామీద కబుర్లు చెప్పుకుంటాంగాని-' అంటూ నన్నులాక్కెళ్ళింది గడుసు గుంట మాధవి, వాళ్ళాయన ఏవనుకుంటాడో అనేనా అనుకోకుండా.

వెన్నెల తక్కువ స్థాయిలో కురుస్తోంది. సినిమా వదిలేసి చాలాసేపైనట్టుంది. వాతావరణం నిశ్శబ్దంగావుంది. ఇద్దరం డాబామీద ఎదురెదురుగా కూర్చున్నాం. ఆకాశంకేసీ, గాలికి వూగుతున్న కొబ్బరిమట్టలకేసీ చూస్తూ. మాధవి మొదలుపెట్టింది.

దాదాపు నాలుగు నెలలనుండీ చూస్తున్నాను భారతి ప్రవర్తన. చాలా విచిత్రంగా వుండేది. అంత తుళ్ళుతూ గెంతుతూ లేడిపిల్లలా వుండే దాన్లో ఈ నిర్లిప్తత, నిరాశ ఎందుకు వచ్చాయో నాకర్థం కాలేదు. మరీ పిచ్చిగా బొమ్మలు వేసేది. ఏవేవిటో మాట్లాడేది. 'దాని మాటలు అర్థం చేసుకునే స్థితికి నేను ఎదగ లేదేమో-' అనిపించేది నాకు.

ఏవయసులో ఆ ముచ్చటన్నారు. పెళ్ళికాలేదని, ఆ బాధ్యత గుర్తించే తల్లి లేదని బెంగపడుతోందేమోని అనుకునేదాన్ని. ఐనా నా వెర్రిగాని, అసలలాంటి మనిషేనా అది? అలాంటిది బెంగకింద తీసుకునే వ్యక్తేనా అది? పోనీ, ఎవర్నైనా ప్రేమించిందేమో! తండ్రికి చెప్పటానికి జంకుతూందేమో అని అనుకున్నాను.

'ఇలాంటి విషయాల్లో భయపడాల్సిందేమిటీ? నీకిష్టమైన వారి గురించి, నీ స్వంత తలిదండ్రులకు చెప్పడానికి ఇంత జంకెందుకూ?' అని అది ఒకసారి మన నళిని విషయంలో అంది. జ్ఞాపకం వుందా? అలాంటి మనిషా వెనకాడుతుంది? ఐనా చాలా కదిపిచూశాను. ఉహు.........ససేమిరా తెలుసుకోలేక పోయాను. ఇంత గంభీరవ్యక్తిగా అది మారిపోవడానికి ఏదో బలమైన కారణం వుండితీరుతుందని అనిపించేది. కానీ ఈ సంసారంలో తెమిలి నెలకోసారైనా దాన్ని కలుసుకోలేక పోయేదాన్ని. ఆఖరిసారి దాన్ని కలుసుకున్నది నెలక్రితం.

బ్రహ్మానందంగారు వీధి వరండాలో కూర్చొని వున్నారు. ఆయనలో ఏదో ఆవేదన, ఆలోచన కనిపించాయి. పిచ్చివాడిలా చూస్తున్నారు. గెడ్డం చేసుకుని ఎన్నాళ్ళయిందో? 'భారతి వుందాండీ-' అని అడిగాను. ఆయన పరధ్యాన్నం నుండి తేరుకుని 'ఉ' అని, మేడవేపు వేళ్లు చూపించారు.

ఆయన నిశ్శబ్దతకు ఆశ్చర్యపోయాను. మేడమీద గదిలో, తల దువ్వుకోకుండా, నలిగిన చీరతో, నాలుగురోజులు లంఖణాలున్నదాన్లా భారతి కనిపించింది. అప్పుడుకూడా ఏదో బొమ్మ వేస్తోంది. నన్నుచూసి, దాని ముఖంలో చిన్న చిరునవ్వు ఇలా కనబడి అలా మాయమైపోయింది.

'రా మధూ కూర్చో. కొత్తబొమ్మ వేస్తున్నాను చూడు-' అంది.

చూశాను. బొమ్మనికాదు భారతిని. అదెంతో అనుభవభారంతో వృద్ధురాలైపోయినట్టూ మాష్టారిదగ్గిర రెండోక్లాసు కుర్రాడిలా దానిముందు నేను నిల్చున్నట్టు అనిపించింది. అది బొమ్మగురించి చెప్పుకుపోతోంది. నాకు సరిగ్గా బోధపడ్డంలేదు. బొమ్మవేపు చూశాను. ముఖమంతా కళ్ళున్న ఓ యువతి. దాదాపు అర్ధనగ్నంగా, కాళ్ళు ముడతపెట్టి, మోకాళ్ళమీద కూర్చుంది. ఆమె దగ్గరగా ఆజానుబాహువైన ఒక పురుషుడు కళ్ళింతింత చేసుకొని ఆమెను చూస్తున్నాడు. వళ్ళంతా కళ్ళు చేసుకొని చూస్తున్నాడా - అన్నట్టు. అతని శరీరంనిండా, చిన్నా పెద్దా సైజుల్లో ఎన్నో కళ్లున్నాయి.

ముందు భయం వేసింది. తర్వాత పరీక్షగా చూశాను. చివరికి - 'ఇది అహల్య బొమ్మకదూ! ఇతను సహస్రాక్ష దేవరాజుకదూ?-' అన్నాను.

భారతి నిట్టూరుస్తూ 'కాదు' అంది. చాలా రైటుగా చెప్పానని ఆనందించిన నాకు ఎంతో ఆశాభంగం కలిగింది. దాన్నడిగాను. అదేదో పెద్దపెద్ద మాటలు వుపయోగించి బోధపరిచింది. నాకు బోధపడింది మాత్రం అతి స్వల్పం.

'పురుషు డెప్పుడూ, వాడెవడైనా స్త్రీని దాహపు దృష్టితోనే చూస్తాడు' అంది నాకు బోధపరిచే ధోరణిలో.

ఇంకా– 'మధూ' జీవితంలో ఏదో లోపం....ఈ స్త్రీ పురుషులమధ్య ఏదో ఊహించ వీలులేని బంధం....అన్నిట్నీ మించి సెక్స్....విద్యలో, సంస్కారంలో వున్నతుడైనా, మనిషి ఈ సెక్స్‌నిమాత్రం జయించలేడుస్మా.... సెక్స్ ...ఈ సెక్స్....సంస్కారాన్నికూడా వెనక్కినెట్టి, కళ్ళకు పొరలువేసి.... మతి భ్రమణం కలుగజేసి....ఏవిటో నా తల వేడెక్కిపోతోంది. అన్నీ ఆలోచిస్తుంటే! నాలాంటి బతుకు....ఇలాంటి పరిస్థితులు ఎవరికీ రాకూడదని మాత్రం కోరుకుంటున్నాను. అంటూ ఆవేళ అది పిచ్చిదానిలా మాట్లాడింది. నాకు బోధపడింది కొంత....బోధపడంది కొంత. వెళ్తున్నప్పుడు నన్నాపి కళ్ళలో నీళ్ళు తిరుగుతూండగా – 'మధూ! ఒకవేళ నేను చచ్చిపోయానని వింటే నా కోసం ఒక్క కన్నీటిబొట్టు రాలుస్తావు కదూ–' అంది. నేను చలించిపోయాను. భారతి ఎందుకిలా మాట్లాడుతోందని విలవిల్లాడిపోయాను.

నువ్వు అదృష్టవంతురాలివి. కోరుకొన్న భర్త, చక్కని కొడుకు ఇంతకన్నా కావాల్సిందేముంది? మధూ....వయసులోవున్న స్త్రీకి అందరూ శత్రువులే. దానికి కారణం ఏమిటనిమాత్రం అడక్కు. అదంతే–' అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

వీధివరకూ సాగనంపి, వదలలేక వదిలే భారతి, ఇవాళ ఇలా నేనింకా కదలకుండానే లోపలికి వెళ్ళిపోయిందంటే....నా మనసు అదోలా అయిపోయింది. సరిగ్గా వారంక్రితం మీ బావగారు ఈ వార్త చెప్పగానే, వెర్రిదానిలా వాళ్ళింటికి పరిగెత్తాను. ఏవుందక్కడ? వరండాలో బ్రహ్మానందంగారు పిచ్చిగా నవ్వుతూ, ఏడుస్తూ, కళ్ళు తుడుచుకుంటూ – నా వేపు చూసి –

'వచ్చావా అమ్మా....పాపీ చిరాయువన్నారు. నేనింకా బతికేవున్నాను తల్లీ....కమల వెళ్ళిపోయినప్పుడే నేనూ పోయుంటే, ఈ ఘోరం జరిగేది కాదు....' మరి మాటాశ్ళేక కూలబడి పోయారు.

మేడమీద గదిలో మంచంమీద ప్రశాంతంగా నిద్రపోతోంది భారతి. ఆ ముఖంలో ఆవేదన, ఏదో అశాంతి ప్రస్ఫుటంగా కనిపించాయి. గదినిండా రకరకాల పెయింటింగ్స్.

భారతి మరి లేవదు, ఆమెలో చైతన్యం మరి చూడం, ఆ కుంచెలో రంగులు మరి ప్రతిఫలించవ్. పాతికేళ్ళు నిండని భారతి కొవ్వొత్తిలా కరిగి పోయింది. నిద్రమాత్రలు మింగి, తనను తాను అంతం చేసుకున్న భారతి చావులో ఆంతర్యం నాకింతవరకూ అర్థంకాలేదు. ఆమెకు వచ్చినలోపం ఏమిటి? ప్రాణాలు తీసుకోవల్సినంత ఘోరం ఏం జరిగింది? ఇవన్నీ నాకు మిగిలి పోయిన ప్రశ్నలే.

'రాధా....భారతి ఏదో చెప్పుకోలేని బాధకు గురైంది. ఆమెలోని అంతర్యుద్ధమే ఆమెని అంతంచేసింది. ఇది నిజం-' అంది నిట్టూరుస్తూ మాధవి.

ఊపిరి బిగబట్టి విన్నాను భారతి కథ. ఉన్నత శిఖరాలందుకుంటుం దను కున్న భారతి, ఇలా ఏదో ఆవేదనతో అంతం ఐపోవడం నన్ను కలిచివేసింది. ఇద్దరం నిశ్శబ్దంగా రోదించాం - మా చీర చెరగులు కన్నీటిని నింపుకున్నాయి.

♦ ♦ ♦

బ్రహ్మానందంగారు మతి స్థిమితాన్ని కోల్పోయారు. తన రచనల నన్నిటినీ ముందు పెట్టుకుని, గట్టిగా నవ్వుతూ ఇష్టంవచ్చిన ధోరణిలో చదువు కుంటున్నారు. నన్నూ, మాధవినీ చూసి ఆయనేమీ అనలేదు. ఇద్దరం మేడమీద భారతి గదిలోకి వెళ్ళాం. గదిలో ఎటుచూసినా దృష్టి మరల్చుకో వీలులేని రంగు రంగుల పెయింటింగ్స్. అక్కడ ఒక స్టేండ్‌మీద పలచని తెర కప్పివున్న పెయింటింగ్ ఒకటి కనిపించింది. దాన్ని చూడాలని ఆ తెర తొలగించాను.

పెయింటింగ్ చాలా గజిబిజిగావుంది. ఏ రంగులూ, భావాలూ స్పష్టంగా లేవు. కానీ, జాగ్రత్తగా చూస్తే అది సృష్టికర్త బ్రహ్మరూపం అని బోధపడు తుంది. అతని తొడమీద వీణాపాణి సరస్వతి. ఆమె నడుముచుట్టూ చేతులువేసి, బ్రహ్మ సకల జీవరాసుల్నీ సృష్టిస్తున్నాడు. చుట్టూ రకరకాల రూపాల్లో అసం పూర్ణమైన ఎన్నో జీవరాసులు రాసులుగా వున్నాయి. ఆ పెయింటింగ్ చివర్న డ్రాయింగ్ పిన్నుతో ఒక చిన్న కాగితం గుచ్చివుంది. అది తీసి చదివాను. అందులో 'తొలిసూతయై, మలిసతియైన వలపులరాణి పలుకులవాణి'-అని వుంది.

ఏదో తలలో మెరిసినట్లయింది. భయంకరంగా ఒకరివేపొకరం చూసు కున్నాం మరక్కడ నిలవలేక గబగబా వరండామీదకొచ్చాం. అక్కడ బ్రహ్మా నందంగారు బిగ్గరగా తన సాహితీ సృష్టిని పునః పునః చదువుతున్నారు.



# ముళ్ళ కిరీటం

సైబ పరంధాములు

తడుస్తున్న చీకటి – ఏవో జ్ఞాపకాలు – నోరు పీల్చుకునేట్టు గదిలో చల్లనిగాలి – దెయ్యాల కథ వింటున్నట్టుగా వాతావరణం. మైకంలో ఊగిసలాడిపోతూ చిమ్నీ కళ్ళింతజేసి చూడసాగింది. కేన్వాసుపైని చిత్రం రంగులు పుల్మకుంటోంది. జారవిడుస్తున్న వస్త్రాల్లో వేదన–నదిలోకి దిగబోతూ ఓ యువతి. నిశీకాంత స్వర సమ్మేళనం చేస్తుందేమో, హాయిగా ఉంది.

తలుపు తట్టుకోసాగింది. వినిపించుకోనట్టుగా చేతిలోని కణిక కదల సాగింది. మళ్ళీ.... మళ్ళీ.

'బాబూ!' చీకట్లు చీలుస్తూ ఓ స్వరం. ఈసారి కాటేజ్ వణికింది.

'ఎవరు?' లాభం లేదనిపించి పలికాను. జవాబు లేదు.

తలుపు తల బాదుకుంటోంది. వేళగానివేళ. ఆ అరుపులో జీరవోయిన గొంతు – తడిసి ముద్దయి పైకొస్తున్న ఆర్తనాదం. ఊరికి ఉత్తరాన అన్నట్టుగా సంఘానికి మరీదూరంగా, ప్రశాంతంగా ఉంటున్న నా ఈ గుడిసెలోకి–ఎవరూ ఎరగని నా కొరకు వచ్చింది! ఎవరైౖ ఉండొచ్చు. ఆలోచించే సమయాన్ని కూడా ఇవ్వలేక మళ్ళీ చప్పుడు.

తలుపు తీశాను. సుయ్మని శరీరంలోకి చొచ్చుకొని ఉప్పెనలా గది నాక్రమించింది ఈదురుగాలి. బయట హోరున వర్షం. మసకమసగ్గా గదిలో దోబూచులాడ్తూ మెఱుపులు.

'హమ్మయ్యా....' ఊపిరి పీల్చుకుంది. లోనికొచ్చి తలుపు గడియ పెట్టిన శాల్తీ.

నికషలా చూశాను. తడిసిన బట్ట ఒంటి నంటిపెట్టుకొని ఉంది. అక్క-డక్కడున్న చిరుగుల్లోంచి బంగారం శోభ బయటపడసాగింది. ఎవరు దీపం పెట్టుకున్నారో ఏమో చిదిమినట్టుగా బుగ్గలపై గాట్లు, ఇక చూడలేకపోయాను. స్టూలుతప్ప మరో సింహాసనం లేదు గదిలో.

'కూర్చోండి....' చాప పరచి కుంపటి వెలిగించాను – 'క్షమించాలి మీరు ఏమీ అనుకోకపోతే' ఏదో మాట్లాడాలన్న తాపత్రయం నాకు.

బెదురుతున్న చూపులు వాల్చుకుంది. ఎణికిపోతూంది. ఆమె మోకాళ్ల

ముడుచుక్కూర్చుంది. కుంపటి వెలుతురులో, వెచ్చదనంలో పొడిమాటలు పొడిగించక అలా చూస్తూ ఉండిపోయాను.

వయ్యారాలొలకబోస్తూ కులుకులు చూపెడ్తున్నాయి-ఆకసంలో మెరుపులు. గాలివాటంకొద్దీ కిటికీలోంచి జల్లు కొడ్తోంది. తూగుతూ చెట్లకొమ్మలు గొణుక్కోవడం, లీలగా నక్కలు వంతపాడడం వినబడ్తోంది.

'క్షమించాలి. మీరు నొచ్చుకోకుండా ఉంటే ఓవిషయం.... అడగనా....?'

కళ్ళెత్తింది. విహ్వలత ఆ చూపుల్లో తొంగి చూచింది. నేను చెప్పబోతున్నాను. 'మీపై ఏదో పెద్ద అఘాయిత్యం జరిగినట్టుంది' అన్నాను.

ఆ సమయంలో ఆమె ఒళ్ళు జలదరించడం, శరీరం వేదనలో వేలత్రాచుల కాట్లకు వలె ఆర్తనాదం చేయడం గ్రహించాను.

ఆమె కళ్ళల్లో వరదలు పొంగాయి. ఆమె మోకాళ్ళ మధ్యనుంచి గట్టిగా వెక్కిళ్ళు వినబడసాగాయి.

'జరిగిందానికి వగచి లాభంలేదు. మీకభ్యంతరం లేకపోతే మీ చరిత్ర చెప్పగలుగుతారా. వీలయితే మీకు సహాయం చేస్తాను.' రెండు చిన్న కట్టెలు కుంపటిలో వేసి కిటికీ తలుపులు మూసి వచ్చాను.

పండుతున్న యవ్వనంలో ఉబికొచ్చే ఊరోజాలనుండి సముద్రంలోని అలలాగా తప్పుకొన్న పైట పొట్ట నంటుకుపోయింది. చెదిరిన ముంగురులపై ఇంకా చినుకులు, నుదుట సగం కుంగిన సూర్యునిలా తుడుచుకుపోయిన కుంకుమ. మంటలు ప్రతిఫలిస్తున్న కనుపాపలు.... గూడుకట్టిన ఆవేదనలో ఒదిగి కూర్చున్న శిల్పంలా ఆమె.

'ఈ విపత్సమయంలో ఆసరా తీసుకొని ఆదుకున్న మీకు నా కథ వినిపించకుండా ఎలా ఉండగలను. సహకారానికి కృతజ్ఞతలు....'

ఆమె చెప్పడం మొదలుపెట్టింది.

'అనగనగా ఒక సంస్థానానికి ఒక మకుటం లేని మహారాజు. అతనికో మహారాణి. ఎన్ని యజ్ఞయాగాదులు చేసినా తీర్థయాత్రలు చేసినా వారికి సంతానం మాత్రం కలుగడం లేదు. అతని వద్దొక మాలి ఉండేవాడు. వానికొక పండంటి కూతుర్నిచ్చి పాపం వాని భార్య తనువు చాలించింది. ఆ అమ్మాయిని చూచి నప్పుడల్లా వాని అదృష్టాన్ని, పిల్లఅందాన్ని తెగ పొగిడేవాడు. 'మీ పాప భువన సుందరిరా, నీ ఇంట్లో తప్పిపుట్టిందిరా. అసలు మాలాంటోల్లవద్ద ఉండాలి గాని....' అంటూ ఎత్తుకొని ముద్దాడేవాడు మహారాజు. అందుకామాలి 'మీకూతురే అనుకోండి బాబయ్యా' అనేవాడు ఆ అమ్మాయిపైని అభిమానం

కొద్ది – అంతకుమించిన ప్రేమకొద్దీ ఆమెను పోషించసాగాడు. చదివించ సాగాడు, హైస్కూలుచదువు పూర్తయేసరికి ఎదపై ఎదిగిన యవ్వనపొంగుల్తో ఉవ్విళ్ళూరించేది. ఏదో వంకతో–ఆమె ఒళ్ళు నిమిరే ఆ రాజు ఇక ఆపుకోలేక ఒకనాడు మహామహా వాళ్ళందర్నీ పిలిపించి ఆ అమ్మాయికీ తనకూ 'ఎంగేజ్ మెంట్' అని ప్రకటించాడు. 'తండ్రిలాంటి వారికిది తగదు ఛీ సిగ్గుచేటు' అంటూ బ్రతిమిలాడిన మాలిని మనలో లేకుండా చేశాడా మహారాజు. ఇంకా జాగుచేస్తే మరేం ప్రమాదాలు ముంచుకొస్తాయోనన్న అనుమానంతో పెను భూతమై మరునాడే బలవంతపుపెళ్ళి ఖాయంచేసి తన పంతం నెగ్గించుకున్నాడు.' అక్కడితో ఆపి నాకేసి చూసింది.

'ఈ అమ్మకథ చెప్తున్నారు మీ గూర్చి చెప్పమంటే. అయినా.... ఆపేశారేం....కథ ఇప్పుడే కదుల్తోంది, ఆ తరువాత.'

'ఆ తరువాత పతాకస్థాయి అంతే'.

'మరీ అంత త్వరలో పూర్తిచేస్తే ఎలాగండీ'.

'మరి, ఏం చేయనండీ కథను సాకడం నాకు చేతకాదు. పోనీ మీరు చెప్పగలరా. ఆ కథనెలా మెలికలు తిప్పాలి. పాఠకుల్నెలా ఆకట్టుకోవాలి.

'నేను రచయితనుకాను చిత్రకారుణ్ణి. రేఖల్నెలా మెలితిప్పితే చిత్రాని కందం ఆకర్షణ వస్తుందో వివరించగలను గాని రచనలో నాకు ప్రవేశం లేదు. ఐనా పరిచయముంది. అడిగారు కాబట్టి నాకు తోచింది చెప్తాను. కాని ఇంత వరకు మీరెవరోమాత్రం చెప్పలేదు. మరి రెట్టించి అడిగి మిమ్మ నొప్పించ దలచలేదు. ఇందాక చెప్పింది నిజంగా మీకథే ఐతే అందులోని మాలికూతురు మీరై వుండాలి. అలా అనుకొని ఆ కథకు క్లుప్తంగా నా ముగింపు చెప్తాను. మాలి కూతుర్తో మహారాజుకు పెళ్ళయిపోయింది. శోభనం నాటిరాత్రి లావాలా అతని కామం పెల్లుబికింది. ఆమె అందులో దహించుకు పోయింది. అంత వరకు పెంచినమమకారం పామై తన్ను కాటువేసినందుకు కాదు. కంటి వెలుగులా తన్ను చూసుకుంటున్న, తనపై ఎన్నో ఆదర్శాల్ని పెంచుకుంటున్న కన్నతండ్రి ప్రాణాల్ని తన కొరడాకొన కైజేసిన కసాయివానిపై ప్రతీ కారం–ఏ ఇంట తిన్న అన్నాన్ని ఆ ఇంట్లోనే విషంగా మార్చి వెళ్ళగక్కాలన్న తపన–అంతే, దాని పరిణామం అప్పుడే ముసురులోనున్న వానగూడా ప్రతీ కార భావనతో విజృంభించింది. తనివితీరి కానరాని స్వర్గసౌఖ్యాల్లో తేలిపోతున్న మహారాజు తెరచుకున్న నోట్లో పైట చొప్పించింది, వెంటనే రొమ్ములో ప్రక్క నున్న పళ్ళ పళ్ళెంలోని కత్తి దూసుకుపోయింది. వాతావరణం కలుషితమై పోయింది....ఉఱుములు, మెఱుపులు. ఇక అక్కడ లిప్తకాలంగూడా నిలువలేక గదిదాటి, ఊరు విడిచి పొలాలు గడిచి అడవిలో మారుమూల ఉన్న ఇలాంటి ఇంట్లోకి ప్రవేశించింది....' అంతవరకు చెప్పి ఆమెను పరీక్షించాను. ఊపిరివల్ల

ఛాతీ ఊగిసలాడుతోంది. కారుచీకటిలాంటి ఆ కన్నుల్లో కాంతిరేఖ పొడిచింది.

'బాగుందండి ఊ....పశ్చేం జరిగుంటుంది.' ఉత్సుకత ఉత్సాహం ఆ కంఠంలో పెనవేసుకున్నాయి.

'ఏం జరుగుతుందా....ఊఁ....'కొస్త ఆలోచించాను. ఏం చెప్పాలా? అని 'ఇక్కడేం జరిగిందో అదే అంటే ఈ గదిలోని సంఘటన'.

'అయినా కథ పూర్తికాదుగా....'

'నిజమేమరి మీరు కథ నెత్తుకొనే పద్ధతి బాగోలేదు. నాకు నచ్చలేదు. అయినా ముగింపుకోసం ఈ కథావస్తువుకు 'శుభం' మాత్రం పలుకలేను. మరి వినండి ఆమె నావంటి కళాకారుని శరణుజొచ్చింది. అసలు విషయాన్ని మరుగు పర్చి తనగూర్చి మరేదో చెప్పింది.

'అదికూడా చెప్పండి' అదో జిజ్ఞాస. ఆ కళ్ళల్లో, ఆ కంఠంలో.

ఆమె మాటల్లోనే చెప్తాను. ''నేనెక్కడపుట్టానో ఎరుగను. బుద్ధివచ్చినప్పటి నుండి చిల్డ్రిన్స్‌హోంలో పెరగసాగాను. అడపాదడపా సూపరింటెండెంట్ వద్దకు కొందరు మగరాజులు వస్తుండేవారు. ఏం మాట్లాడుకునేవారో గాని నవ్వులు మాత్రం వడగళ్ళ వానలా వినిపించేవి. ఎదపై యవ్వన శోభ లుబికే సరికి నాకా వాతావరణం విషవాటికలా తోచింది. అప్పటికే సూపరింటెండెంట్ కొందర్ని నాతోపరిచయం చేయడం వాళ్ళ వెకిలిప్రవర్తన వెగటని పించింది. అంతే ఒకనాటి అర్ధరాత్రి ఎవరికి చెప్పాపెట్టక....''

'ఆగండి చాలా బాగుందండి. ఆ తరువాత కథ కొంత నేనుచెప్తాను మీ కభ్యంతరం లేకపోతే....'

'మంచివారేనే....మీరు కదా ఇంత వరకు కావాలని నా ద్వారా చెప్పిం చింది. అందుకు నా అభ్యంతరమేంటి చెప్పండి.'

'....బయట హోరున గాలివాన, మసిబారిన ప్రపంచం. అందుకని ఆ రాత్రికి తన తలదాచుకోనిస్తే వేకువవేళకి మరెక్కడో తన జీవితాన్ని వెతుక్కో బోతానని కళాకారుణ్ణి ప్రార్థించిందాస్త్రీ.'

'తలేంటి ఖర్మ ఒళ్ళంత దాచుకోండి. మెచ్చినంత మేర నచ్చినంతకాలం హాయిగా ఉండండి. అందుకు నాకేం కష్టనష్టాల్లేవు!' అన్నాడతడు.

ఆమె 'సరే'నంది. ఆమెనతడు మోడల్‌గా ఉపయోగించుకొని మంచి చిత్రాలు గీశాడు. ఆమె గృహిణిలా అతనికి సహకరించింది. కొన్నాళ్ళకిద్దరు భార్యాభర్తలయ్యారు ఎలా ఉందన్నట్టున్నాయి ఆమె చూపులు.

'ఫరవాలేదు. కాని నాదో అనుమానం. కథాప్రారంభానికి ముగింపుకు ఏదో అవినాభావ సంబంధముండాలి....మరి మీరు సుఖాంతం చేశారు. అదే నాకు నచ్చలేదు. మరినేను చెప్తాను వినండి కొన్నాళ్ళలా ఆ రెండు హృదయాలు మీరన్నట్టుగానే ఆనందంగా స్పందించసాగాయి. కొన్ని ఉత్తమ కళాఖండికల

సృష్టి జరిగింది. ఆ సంతోషం ఝంఝులో గత స్మృతులు సమసిపోయాయి. ఆవేదనలంతరించాయి. ఒకనాటి దుర్దినోదయాన ఆ చిత్రాల ప్రదర్శన నగరం లోని కళాభవనంలో జరిగింది. పోలికలు గుర్తించిన పోలీసుశాఖ ప్రశంసల వర్షంలో కళాకారునితోపాటు తడుస్తున్న ఆమెను బంధించింది. సంస్థానాధీశుని హత్యానేరాన్ని వివరించింది.'

పిడుగు పైబడినంతగా అరుపు. రెండు చెవులు గట్టిగా అదుముకున్నాను.

'కాదు.... కాగూడదు....' ఆమె ఒగరుస్తోంది ఆమె రూప చిత్రాన్ని గీశాను. దాన్ని తొందరగా గోడవారగా ఉంచి నిలబడ్డాను.

'అలా ఎన్నడూ జరగటానికి వీల్లేదు.' తాండవం చేయసాగింది.

'ఏంటండి ఏం జరిగింది మిమ్మల్నెవరేమన్నారని. అలా ఉన్నారు. శాంతించండి...." ప్రాధేయపడినంత పని చేశాను. ఆమె సద్దుకుంది.

"ఆర్టిస్టుగారూ మీ ఆదరణకు ఆప్యాయతకూ నిండుమనసుతో కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. నేను చెప్పిన కథకు మీ ముగింపు నాకెంతో నచ్చింది. ఇక మీ వద్దదాచలేక నే నెవరో చెప్పుకుంటున్నాను. వినండి. మీరూహించినట్టు ఆ కథనాదే. ఇక్కడికి ఆరుమైళ్ళ దూరంలో 'దోమకొండ' సంస్థానముంది. ఇప్పుడా సంస్థానాలంటూ ఏమీ లేకున్నా అంతటి ఆస్తికి అధిపతి 'రత్నాకర రావు' ఉండేదొక్కడే. కల్పించి మీరా కథను పొడిగించినా అది నాపట్ల కత్తి మొనలాగా నిజమైంది. ఆ రాత్రి భర్తగాగాదు కాముకునిలా నాతో తృప్తి పడ్డాడు. దాంతోపాటు కన్నతండ్రిని చంపించాడన్న ప్రతీకారవాంఛ తోడై నాతో అతన్ని హత్యచేయించింది. అప్పుడు వెంటనే కలిగిన భయత్కంప నాలతో అనాలోచితంగానే పారిపోయి వచ్చాను. తీరా మీ ముగింపులో 'పోలీసు' మాట వినేసరికి నాలో విచక్షణాజ్ఞానం జాగృతమైంది. నీరుపల్లమెరుగు. ఎప్పుడో ఒకనాటికి చేసిన తప్పుకు అలాగని మాటల్తో మనసుమార్చి లేనిదానికి నేనుచేసింది తప్పని తోచటంలేదు. అయినా అందుకు అరదండలందుకోక తప్పదేమో. మొత్తానికి ప్రతీకారం మాత్రం తీర్చుకున్నాను. అదిగో తెల్లవార నున్నట్టుంది. నేనుగావెళ్ళి ఆ శాఖవారికి పట్టుబడ్తాను. అందాక ఈ జీవి ముళ్ళ కిరీటంతో స్థిమితంగా బ్రతకలేదు. మీరు నిశ్చింతగా ఉండండి. మీరు నా చిత్రాన్నిగీయడం నేనెప్పుడో గమనించాను. ఒక గొప్పచిత్రకారుని చిత్రంగా ఉండడం నాకు చాలా గర్వంగాఉంది. ఎందుకో మీ పరిచయం ఎన్నాళ్ళ అను బంధమో గుర్తుకు తెస్తోంది. నన్నెలాగూ ఉరి తీయరు. వీలుకలిగించుకొని అప్పుడప్పుడు మీ దర్శనం కలిగించండి. నాకా ఆత్మ సంతృప్తివి అందిస్తారనే ఆశ. ఇక నే వెళతాను సెలవు...."

తలుపు తెరచుకొంది. విహగావళి స్వాగత గీతాలు వినబడసాగాయి. వెలుగురేకలు గదిలో స్థానంచేసికొంటున్నాయి. ఆమె వెళ్ళిపోతోంది.

# క్షమయా ధరిత్రీ

'చక్రపాణి'

'హలో ! దిసీజ్ లేడీస్ హాస్టల్. మే ఐనో వేర్ ఫ్రం యూఆర్ స్పీకింగ్ ?' విరామం లేకుండా అయిదు నిముషాల్నుంచీ మోగుతోన్న ఫోన్ను విసుగ్గా అందుకొంది ప్రక్కనే చదువుకొంటూన్న సీత. అది మూడో అంతస్థు ఆఫీసు గది ప్రక్క గదవడం వల్ల సీతకాబాధ తప్పడం లేదు ప్రతీసారీను.

'........................'

'అప్పుడే తెల్లారిందీ మీకు, డర్టీఫెలోస్' అంటూ తీసినంత విసుగ్గానూ పెట్టేసింది ఫోన్ను.

మరికొంత సేపు గొడవచేసి, లాభంలేక నోరుమూసేసుక్కూచుంది ఫోను.

నల్లని సముద్ర గర్భంనుంచి, ఎఱ్ఱని ఉషఃకాంత పురుడు పోయగా బయల్వెడలిన బాలభానుడు తల్లికి దూరం దూరంగా జరుగుతూ తన తెల్లని వెండి కిరణాలతో తల్లితో ఆడుకుంటున్నాడు. ఆ తల్లి ఉప్పొంగి ఆనందంతో ఉరకలు వేస్తోంది. ఇదంతా గమనిస్తూ, ప్రకృతి నిత్యనూతనత్వానికి ముగ్ధ మయేటంత భావుక హృదయం లేదా ప్రాంగణంలో. ఉన్నా, ప్రొద్దునే అంత తీరిగ్గా కూచొని ప్రకృతి పరిశీలన చేసేందుకక్కడి వారికి తీరికాలేదు.

సీత వరండాలో కుర్చీవేసుకొని కూర్చొనుంది. విరబోసిన తలను పిట్ట గోడకానించి, వీపు సూర్యుడి కప్పగించి తడితల నారబెట్టు కొంటోంది.

స్నానంచేసి బాత్రూంనుంచి అప్పుడేవస్తోంది ఇందిర. ఒకచేతిలో సోప్ కేసూ, మరోచేతిలో విడిచినబట్టలూ ఉన్నాయి. బుజాన టర్కీ టవల్ వేలాడుతోంది.

'ఇందూ ! ఆ వెధవలు ఫోన్ చేశారే' అందిసీత.

'వాళ్ళకది మామూలేగా. మరి, నిన్న సాయంత్రం రాజేశ్వరి తన్ను పిలవమంది గదూ, పిలవక పోయావ్ ?' గదిలోకిపోయి తలుపులు వేసుకొంటూ అన్నది ఇందిర.

'నీటి జంతువులు. వాళ్ళతో చేమిచే....' తనలో అనుకొంటున్నట్టుగా అనుకొంది సీత. వినబడకో, సింగారానికి భంగమనో గాని ఇందిర మాత్రం సమాధానమియ్యలేదు.

సీతా, ఇందిరా క్లాస్‌మేట్సూ రూమ్‌మేట్సూను. ఒక ఒరలో రెండు కత్తు

లిముడని మాటేమోగాని, ఒక అరలో రెండు కొప్పులిముడతాయనడానికి యూని వర్సిటీ లేడీస్ హాస్టల్సే నిదర్శనం. రెండుకాదు. సమయాన్నిబట్టి నలుగుర్నీ, అయిదుగుర్నీకూడా యిముడుస్తారు అధికారులు. భిన్నప్రకృతులవాళ్ళూ, భిన్న ప్రాంతాలవాళ్ళూ చదువుకోసమని వచ్చి చేరతారు. ఎవరి అభిరుచులు వాళ్ళవి, ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి. అయినా అక్కడుండే రెండేళ్ళలోనూ ఏదో తెలియని ఆత్మీయత వాళ్ళమధ్య పెరుగుతుంది. ఒక మధురమైన అనుభూతిగా జీవితాంతం అది మిగులుతుంది.

ఇంతకీ అసలు సంగతిది. నావల్‌బేస్‌నుండి ప్రతిరోజూ కనీసం మూడు నాలుగుసార్లు 'బోగస్‌కాల్స్' వస్తున్నాయి. ఎవరో ఏదో పెద్దపనున్నట్టుగా పిలిచి ఫోనులో చాలా అసభ్యంగా వాగుతున్నారు. ఈ అనుభవం ఆ హాస్టల్లో ఇప్పటికి దాదాపు సగంమందికేనా అయింది. ఇందిరకీ, సీతకీ యిది దుర్భరంగా తయారయింది. కారణం వాళ్ళగది ఆఫీసు గదికి ప్రక్కను కావడం.

నిన్నసాయంత్రం రాజేశ్వరి రూంకి వెళ్ళినప్పుడు సీతా, ఇందిరా ఈ విషయం రాజేశ్వరితో చెప్పారు. రాజేశ్వరి ఈసారి కాల్‌వస్తే తనను పిలవ మంది. ఆ విషయంమీద కొంత చర్చ జరిగింది అప్పుడే. ఇందిర ఎలాగోలా వాళ్ల పీడ విరగడయ్యేలా చూడమని మొరబెట్టుకొంది. సీత మాత్రం పోనిద్దూ! వెధవలు వాళ్లు; బురదలో రాయివేస్తే....' అని ఏమోచెప్పబోతుండగా ఇందిరా, రాజేశ్వరీ కలిసి ఆమెనోరు మూసేశారు దారుణంగా.

♦ ♦ ♦

బ్రేక్‌ఫాస్టు సమయంలో ఇందిరా, రాజేశ్వరీ కలిసి అందర్నీ సమావేశ పరిచారు. ఇందిర తరచుగా వస్తూన్న 'బోగస్‌కాల్స్' గురించి అందరికీ వివ రించింది. రాజేశ్వరి వాళ్ళకి తగినబుద్ధి చెప్పకపోతే లాభంలేదంది.

'వార్డెన్‌కి రిపోర్టిస్తే సరి' అన్నదొక పుస్తకాలపురుగు.

'ఇప్పటికి చాలా సార్లయిందా భాగోతం' ఆ మాత్రం సలహా నువ్వేం ఇవ్వనక్కర్లేదన్నట్టుగా బదులు చెప్పింది రాజేశ్వరి.

'ఏమన్నారావిడ?' కుతూహలంగా అడిగింది పుస్తకాలపురుగు రూంమేటు.

'ఏముంది గనుక అనేటందుకు ? 'డిటో !' యే ! ఇహ్హిహ్హి.... కళ్లు చికి లించి, పళ్లు బయటపడేలా నవ్వులాంటి యాక్షన్‌చేసి చూపించింది ఇందిర.

అర్థంగాని ఏ యిద్దరు ముగ్గురో తప్ప అంతాగొల్లుమని నవ్వేశారు.

'మొన్ననో రోజున ఫోను మోగుతోందిగదాని ఎత్తాను. అబ్బ! ఎంత అస భ్యంగా వాగాడో!' ఆనాటి తన అనుభూతిని ప్రదర్శింపజేస్తూ అన్నది భాగేశ్వరి.

'మన రంగయ్య నిన్న కాల్ అందుకొంటే తిట్టార' నవ్వుతూ చెప్పింది. సుగుణ.

'అసలు వాళ్ళకదేం పోయేకాలమొనర్రా! లేడీస్‌హాస్టలంటే ఇదేదో బ్రోతల్ హౌస్ అనుకొంటున్నారో, ఏమో, దొంగవెధవలు'.... మెటికలు విరవక పోయినా అందుకు సమానమైన ఆంగికాభినయాన్ని ప్రదర్శించింది మహాలక్ష్మి.

రాజేశ్వరికి కోపంవచ్చింది. ఇందిరకు విసుగెత్తింది. అసహనంగా ఇద్దరూ ముఖాలు చూసుకొన్నారు.

'ఇంతకీ అసలు విషయంవదిలేశాం'.... అన్నది ఇందిర గుర్తుచేస్తూ.

'మీ ఇష్టమొచ్చినట్లు కానీండోయ్, దానికింత గొడవెందుకు?' తేల్చేసింది నిర్మల.

'అలాగంటే కాదు. ఇది మనందరికీ సంబంధించిన విషయం. మీ అందరి కోపరేషన్ లేందే మేం మాత్రం ఏం చేస్తాం?' లేడీస్ రిప్రెజెంటేటివన్నా కాకపోయినప్పటికీ నాయకురాలి కుండాల్సిన లక్షణాలు మాత్రం పుష్కలంగా వున్నాయి రాజేశ్వరిలో.

'కోపరేషనే కాదు, ఏ ఆపరేషను కావాలన్నా మేం రెడీ' చమత్కరించిందో ద్విజట.

'ఓ. కే.?' రెట్టించి అడిగింది ఇందిర.

'ఓ.... కే....' అన్నారంతా.

'అయితే ప్రస్తుతానికో చిన్న రిక్వెస్ట్. సాయంత్రం ఎవ్వరూ గెస్ట్సను కాంపౌండ్‌లోకి గాని, ఈ సమీపాల్లోకి తీసుకొని రాకూడదు. మన ప్రయత్నం ఎవ్వరికీ తెలీకూడదు. సాధ్యమైనంత వరకూ సాయంత్రం ఎవ్వరూ బయటికి పోకుండా ఉంటే మంచిది. కొంచెం కష్టమే ననుకోండి, ఈ ఒక్క రోజుకీ....'

'ఈ మాత్రం దానికేనా! మరేం ఫర్వాలేదులేవోయ్' రాజేశ్వరి మాట కడ్డుపస్తూ హామీ ఇచ్చింది వసంత.

'దెన్ ఆల్‌రైట్. లెటజ్ డిజ్బర్స్' అంటూ సమావేశం ముగించింది ఇందిర.

♦ ♦ ♦

సాయంత్రం. సమయం అయిదుగంటలవుతోంది. సెకన్లూ, నిముషాలూ, భారంగా దొర్లుతున్నాయి. ఆ ఆవరణలో ఏదోగంభీరమైన, బరువైన కృత్రిమ వాతావరణం. విజిటర్స్‌తో 'బిజీ'గా ఉండే సాయంత్రం వేళా, జంటలతో కులాసాగా ఉండే ముందోటా. అరుపులు, అల్లర్లతో ప్రతిధ్వనించే భవంతీ వింతగా విశేషంగా మారిపోయాయి.

కంగారుగా, కుతూహలంగా పదినిముషాలు వెళ్ళిపోయాయి.

పదో నెంబరు బస్సువచ్చి ఎదురుగా రోడ్డుమీద ఆగింది.

ఆగిన బస్సులోంచి అయిదేసి అడుగుల పొడవుగల బలమైన శరీరంగల రెండు విగ్రహాలు దిగాయి. తెల్లనిషర్టూ, ముదరాకుపచ్చనిరంగు పాంటూ, ఫుల్‌బూటూ, మిగలముగ్గిన కలకత్తాజామ శరీరఛాయా—చూడ్డానికి ఇద్దరూ నిండుగా ఉన్నారు.

'రంగయ్యా! రావుఁడూ! ఇద్దరూ....గెట్ రెడీ; గంగాయ్ ఇందిరను రెడీగా వుండమను' టెర్రేస్ పైనుంచి హడావుడిగా హెచ్చరించిందో కంఠం.

వాచ్‌మన్ రంగయ్య మూలనున్న తన దుడ్డుకఱ్ఱను కసిగా ముద్దు పెట్టుకొన్నాడు. కుక్ సింహాద్రి చెట్టుచాటున రోకలిబండ చేతిలోకి తీసికొని దుర్యోధనుడి పోజు పెట్టాడు. సర్వరు రావుఁడు అవసరమౌతుందని ఒకగ్రాడూ, ఒక పాటిలావుగల చేతికఱ్ఱలను సిద్ధంచేసుకొని ప్రక్కనున్న 'వెయిటింగ్ షెడ్'లో దాక్కొన్నాడు. చాకలి రామి, స్వీపరు నర్సమ్మ చీపుర్లు రెడీ చేసుకొన్నారు. నైట్‌డ్యూటీ వాచ్‌మన్ ముసలి అప్పన్న చుట్ట ముట్టించాడు తాపీగా, గేటుకు బయట నిలబడి.

దిగిన వాళ్ళను వదిలేసి వెళ్ళిపోయింది బస్సు. దిగినచోటే నిలబడి పరిసరాలను పరికించారు దిగిన వ్యక్తులిద్దరూ. ఎదురుగా రెండు దారులు. సెంటర్లో ఒక చిన్న బడ్డీ. తమగమ్యం ఎటన్నది వాళ్ళకు సమస్య కాలేదు. పెద్ద భవంతి. భవంతి వరండాల్లో వ్రేలాడుతోన్న రంగురంగుల చీరలు. భవంతికి పైన చేతుల్లో పుస్తకాల్తో పచార్లు చేస్తూ రోడ్డువైపుకి దొంగచూపులు చూస్తోన్న అమ్మాయిలు. అంతకంటే ఇంకేంకావాలి?

నాలుగు కాళ్ళు ముందుకు నడిచాయి. గొందెలాంటి మార్గమది. ఏటవాలుగా వుంటుంది. ఆ సరాసరిపోతే బీచ్‌రోడ్డు. అది దాటితే సముద్రం. ఈ తిన్నగాపోతే ఎక్కడకి వెడతాం? అని అడిగితే, 'సముద్రంలోకి' అని తడుముకోకుండా చెప్పటానికనువైన మార్గమది.

ఆ ఇద్దరూ హాస్టల్‌గేటు సమీపించారు. అప్పన్న చుట్ట నోట్లోంచి తీసి వినయంగా నమస్కరించి గేటు తెరిచి, 'రంగా! అయ్యగోర్లకోరుకావాలో సూడు' అన్నాడు. భవనంవైపు కుతూహలంగా చూస్తూ ఇద్దరూ లోపలికి రెండడుగులు వేశారు.

విజిటర్స్ బుక్కు చేత్తో పట్టుకొని 'ఓరు కావల్న మీకు?' అంటూ ముందుకు వచ్చాడు రంగయ్య. వెనుక మెల్లిగా గేటుకు తాళం పడింది.

'మేరీ—రూంనెంబర్ సిక్స్టీన్' అన్నారిద్దరూ ఒకేసారి.

'ఇద్దరికీ ఒక్కల్లేనా ?' అన్నాడు రంగయ్య అదోలా నవ్వుతూ, చేతిలోని పుస్తకం, పెన్సిలూ అందిస్తూ.

వాడన్నదేమిటో, పుస్తకం ఎందుకిస్తున్నాడో అర్థంకాక ముఖాలు చూసుకొన్నారిద్దరూ. అసలే వాళ్ళ ఆశలు కొంత దెబ్బతిన్నాయి. ఆశాపరేఖ్‌లా అలంకరించుకొని, అయిదుగంటలకల్లా ఎదురు చూస్తూ గేటుదగ్గరుంటానని ఫోన్ చేసిందొకామె. బస్సు దిగగానే 'హల్లో' అంటూ వచ్చి ఆహ్వానిస్తుందనుకొన్నారు. ఇంకా నయం పేరూ, రూంనెంబరూ కనుక్కోబట్టి సరిపోయింది. లేకపోతే యిక్కడకు వచ్చి ఎవరు కావాలని చెప్పడం ?

అసలామె ఎక్కడో రోడ్డుమీదే ఉండి ఎదురు చూస్తోందేమో! ఒకళ్ళమేనని చెప్పి తీరాఇప్పుడు ఇద్దరం వచ్చాం. వీళ్ళు కాదనుకొని ఆమె చూసికూడా ఊరకుండిపోయుంటుందా ఏమూలనన్నా ? ఆమె అంత భవయస్తురాల్లా కనబడలేదు మాటల్లో. ఆమె చెప్పినట్లే గుర్తుపట్టగలిగేలానే డ్రస్ చేసుకొని వచ్చామే!

ఇందులో మోసమేమన్నా ఉందేమో !

సందేహాలతో, అనుమానంతో, భయంతో భారంగా ఒక క్షణం గడిచిపోయింది.

ఎదురుగా ఇంకా వాడాపుస్తకం పట్టుకొని నిలబడే ఉన్నాడు—దీంట్లో రాయండి అన్నట్లు సంజ్ఞచేసి చూపిస్తూ.

పుస్తకం తీసికొని చూశారిద్దరూ. విజిటరు పేరూ, ఎవరికోసం వచ్చిందీ వగైరా వివరాలున్నాయి అందులో. రాయడమా, మానడమా అని ఇద్దరి మనసుల్లోనూ ఒక్కక్షణం సందేహం.

'ముందు ఆవిడున్నదో లేదో చూసిరా, ఉంటే తర్వాత రాస్తాం' ఇంగ్లీషులో అభినయపూర్వకంగా వాడికర్థమయేలా చెప్పారు వారిలో ఒకరు.

ఇంతలో పైట సరిచేసుకొని, ముఖాన పట్టిన చిరుచెమటల్ని తుడుచుకొంటూ, పెదాలను నాలికతో తడిచేసుకుంటూ. తడబడుతోన్న కాళ్ళకు ధైర్యం చెప్పి బయటికి వచ్చింది ఇందిర. వచ్చిన ఇద్దరికీ ఉద్యోగంలో ఒక్కసారి డబుల్ ప్రమోషనయినంత సంబరమైంది.

ఇంతవరకూ మననం చేసికొంటూన్న డైలాగులు కాస్తా ఏమయిపోయాయో నోటినుంచి మాటే రావడంలేదు ఇందిరకి. 'హలో ! కమాన్' అని మాత్రం అనగలిగింది.

తడబాటుతో మౌనంగా రెండు క్షణాలు....

'టంగ్' మని ధ్వని పైనుంచి.

చేతిలోని పుస్తకం, పెన్సిలూ క్రిందపారేసి గట్టిగా వాటేసుకున్నాడు ఎదురుగా ఉన్న వ్యక్తిని రంగయ్య.

పరిస్థితినర్థం చేసికొని మెఱుపులా మొండిగోడ దూకి మాయమయ్యాడు రెండో వ్యక్తి—'కేప్టెన్, ఎస్కేప్' అంటూ.

కేప్టెన్ చోప్రా తేరుకొనే సరికి మూలల్నుంచి రోకలిబండతో ఒకడు, కఱ్ఱతో ఒకడూ, చీపురుతో ఒకామె....తనవేపే వస్తూన్నారు.

గట్టిగా గుంజుకొని, బలంగా ఒక్క త్రోపుతోసి వదిలించుకొని, ఎదురు వచ్చిన వాడినొక్కతన్నుతన్ని, షెడ్ తాలూకూ మూడడుగుల ఎత్తు అరుగు మీంచి ఆరడుగుల ప్రహరీగోడ దూకేసి అమాంతం ప్రక్కనున్న డస్ట్‌బిన్‌లో పడ్డాడు కేప్టెన్ చోప్రా.

పడినవ్యక్తి తాను పడ్డట్టు తెలిసుకోకముందే మీద పడిపోయాడు బయట నుంచి అంతా చూస్తోన్న అప్పన్న.

♦ ♦ ♦

చుట్టూ ఆడవాళ్ళు నరకాసుర సంహారంనాటి సత్యభామల్లా మధ్యలో ఒకే పంజాదెబ్బతో గిలగిల్లాడుతూ పడిపోయిన లేడిపిల్లలా కేప్టెన్ చోప్రా. ఎఱ్ఱగా కంది ఉబ్బిపోయి ఉన్న దవడలు, చెదిరిపోయిన క్రాపు చిరిగిపోయిన వైట్ టెర్లిన్‌షర్టు, జారిపోతున్న టెర్లిన్‌పాంటు....అనతి దూరంలో ముగ్గురు మహాయోధులు రొప్పుతూ—అప్పన్న, రంగన్న, రావుడు—అంతా మహా కోలాహలం.

'ఏరా నాయాలా! ఇక్కడాడోళ్ళుంది నీకోసమే ననుకొంటున్నావా?' జనాన్ని చీల్చుకొంటూ మహా సంరంభంతో వచ్చి నెత్తిమీద చీపురుతో దబదబా వాయించింది నరసమ్మ. విరగబడి నవ్వేరు పరిసరజనం.

'బూటు కాల్తోటి ఎంతగట్టిగా తన్నేసేవురా, నాయాలా!' నడుంమీద ఒక తన్నుతన్ని ఇందాకటిదానికి కసిగా బదులు తీర్చేసుకొన్నాడు సర్వర్ రావుడు.

'అమ్మా!' బాధగా మూలిగేడు గిలగిలా కొట్టుకొంటూ ఆవ్యక్తి.

'నీకు అమ్మా, అక్కా, చెల్లీ అంటూ ఉంటే నువ్విట్లా చేస్తావుట్రా? ఇంకెప్పుడూ మా హాస్టల్‌కి ఫోన్‌చెయ్యకు. జాగ్రత్త' గట్టిగా హెచ్చరించి, గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది రాజేశ్వరి.

ఆ వ్యక్తికి ఎదురుగా ఏమీ కనిపించడంలేదు. వాళ్ళమాటలు అసలు వినిపించడమేలేదు. నోరు పిడచకట్టుకొని పోతోంది. నోటిదగ్గర చేతులు పెట్టుకొని దాహమన్నట్టుగా సంజ్ఞచేశాడు.

'దాహంటే, నోరు ఎండుకపోయి చచ్చిపోతాడో ఏమో, కాస్సిని మంచి నీళ్లు తెచ్చి పొయ్యండి వెధవకి' ఆజ్ఞ జారీచేసిందో దయామయి.

'నువ్వుతే, అంటే నువ్వేతే' అంటూ వంతులు పోయారంతా. ఇంతలో మధులత వచ్చింది చేతిలో డబ్బాడొక్కుతో.

అది చూసి బాధగా మూలిగాడా వ్యక్తి. 'నో, థాంక్స్ ఫర్ యువర్ కైండ్‌నెస్.... నేచెప్పేదికాస్తవినండి. ఫోన్‌చేసి మిమ్మల్ని అవమానించడంతప్పే కానీ.... నేను మీరనుకొంటూన్నంతటి దుర్మార్గుడిని కాను. నేనూ మీలాగే చదువుకొన్నాను.... పొట్టకోసం ప్రాణాల్ని తాకట్టుపెట్టుకొని 'నేవీలో' చేరాను. దేశంకోసం నా సరస్వం ధారపోశాను. మాదీరాష్ట్రమే కాదు. ఇంతకుముందు బొంబాయిలో చేస్తూండేవాడిని.... ఇక్కడి పరిస్థితులు, సంగతులు తెలియవు. జీవితంలో మాకు లభించే ఆనందం ఏమిటి చెప్పండి?' ఇంగ్లీషులో సాగుతోంది అతనిగాధ. బాధతో మూలుగుతూ అప్పుడప్పుడూ ఆగుతున్నాడు. నోళ్లు తెరుచుకొని వింటూ చూస్తూండి పోయారంతా.

ఇంతలో బయట 'జీప్' ఆగినధ్వని ముగ్గురు కానిస్టేబుల్సూ, ఒక ఇనస్పెక్టరూ లోపలికి వచ్చారు. అందరూ ఆశ్చర్యంగా చూశారు.

'నాది పవిత్రభారతదేశం. వీరు, నాచుట్టూ ఉన్న ఈ జనం ఈ పవిత్ర భూమికి ప్రతీకలు సహనానికి మారుపేర్లు!' గొణిగింది అతడి హృదయం.

'వెల్, థాంక్యూ ఆల్' నీరసంగా నిట్టూర్చి, తలవంచుకొని చేతులందించాడు అప్పుడే వచ్చిన ఇనస్పెక్టరుకి.

అతని కళ్ళముందు ఏవేవోదృశ్యాలు. తనజీతంపై ఆధారపడి బ్రతుకుతోన్న ముసలితల్లిదండ్రులు, పెళ్ళీడువచ్చిన చెల్లెలు, బి.ఏ. చదువుకొంటూన్న తమ్ముడు, భార్య, అయిదేళ్ళకొడుకు, సముద్రం, జలాంతర్గాములు, తప్పించుకు పారిపోయిన మిత్రుడు, తన బెటాలియన్.... బాధగా కళ్లుమూసుకొన్నాడు. కన్నుల్లోంచి కారినరెండు నీటిబొట్లు అతని దాహాన్ని తీర్చకపోయినా, పెదాల్ని మాత్రం తడిపాయి.



# మమతలు లేని మానవులు

జయా నాగరాజ

**త**లవాకిట బియ్యం ఏరుకుంటూ కూర్చున్న రమణమ్మ తలపైకెత్తి చత్వారం అద్దాలలోనుంచి తొంగిచూచింది. ప్రక్కయింటాయన పనిలోనుంచి వచ్చి అప్పుడే మెట్లెక్కుతూ కనిపించాడు....చిన్నవయస్సే....నెలక్రితమే పెళ్ళి చేసుకొని పెళ్ళాన్ని కాపరానికి తెచ్చుకున్నాడు. కొన్నాళ్ళక్రితం వరకూ ఆ వాటాలో సుబ్బులు, వాళ్ళ కుటుంబం, తనకన్నా చిన్నదయినా చాలా కలుపు గోలుతనంగా వుండేది. వాళ్ళాయనకు పించనయినాక వాళ్ళ స్వగ్రామం వెళ్ళిపోయారు. అవును మరి తనకోసం కాచుకొని కూర్చుంటారా. మల్లెపూల వాసన గుప్పుమన్నది. పెళ్ళానికై తెచ్చాడు కాబోలు అని నవ్వుకుంది రమణమ్మ. సంధ్య చీకట్లు అలుముకుంటున్నాయి. వీధిలో ఆడుకుంటున్న పిల్లల సందడి తగ్గిపోయింది. అప్పుడే దీపాలుకూడా వేశారు. ఆరున్నర దాటింది కాబోలు. కాని యింకా రిక్షాల గంటలు....కార్లచప్పుడు తగ్గలేదు. ఇళ్ళకు చేరుకునే వారి తాపత్రయం మరి....కళ్ళు బియ్యం ఏరడానికి అనడం లేదు. 'ఏరింది చాలులే' అనుకొని లేచిలోపలకు వెళ్ళి దీపం వెలిగించి దణ్ణం పెట్టుకొని పొయ్యిరాజేసి బియ్యం ఎసరు పెట్టింది. అది వుడికేదాకా తనకు ఖాళీ....పీటలాగుకొని గోడకానుకొని కూర్చుంది. బియ్యం నీళ్లు కలిసి కుత కుత మంటున్నాయి. తనమనస్సుకూడా కుతకుతలాడింది. వద్దంటున్నా గతం 'నేనున్నానంటూ' వచ్చి తన ముందర కూర్చుంటుంది.........

తనూ అక్కా ఎంత అన్యోన్యంగా వుండేవారని. అన్నయ్య చదువుల కని పట్టణాలలోవుండే వాడు. ఎప్పుడో సెలవలకు రావడం మాత్రమే. తనకు అప్పుడు చాలాచిన్నతనం. ఒకరోజు అందరూ ఏడుస్తున్నారు. ఎందుకో తెలియ లేదు. అక్క ఏడుస్తున్నది. అదిచూచి తనకూఏడుపువచ్చింది. ఆనాటినుంచి అమ్మ కనిపించలేదు. ఇంట్లో ఏదో హడావిడి. ఆ హడావిడి తగ్గేసరికి అత్తయ్య తనను తమవూరు తీసుకు పోతానన్నది. తనురానని ఎంతోగోల చేసింది. కాని చదువుల నెపం మీద తను అత్తవెంట వెళ్ళక తప్పలేదు. అక్కయ్య నాన్నతో వుండి పోయింది. అత్తయ్య వూరుపెద్దది. బడిలో చేరింది తను. కాని ఎందుకో భయంగా బెంగగా వుండేది తనకు. రోజులు గడచిపోతున్నాయి. నాన్నదగ్గర

నుంచి పుత్తరం వచ్చిందని అడపాతడపా చెప్పేది అత్త. అంటీ అంటకుండా వుండేది అత్త. మామయ్యతరచు కనబడేవాడు కాదు. వున్నట్టుండి అత్తకు జబ్బు చేసింది. గుండెనొప్పి అన్నారు! బాగావిశ్రాంతి కావాలని డాక్టర్లు చెప్పారు. అత్తకు విశ్రాంతి యివ్వడానికై తేనేం.... తన చదువు పాడుకాకుండా వుండడానికై తేనేం తనని హాస్టలులో జేర్పించాడు మామయ్య. దానితో పూర్తిగా కృంగిపోయింది తను. తను ఎనిమిదో క్లాసు చదువుతున్నప్పుడు అక్క పెండ్లి అన్నారు. తనని యింటికి తీసుకుపోవడానికి నాన్నవచ్చాడు. ఎంత సంబరం. అన్నం మాడువాసన కొట్టింది. రమణమ్మ గబగబాలేచి 'అప్పుడే వుడికిందా' అనుకొని అన్నందింపింది. కూరగిన్నె చూచింది అది ఖాళీ. మతిమరవు మధ్యాన్నం కూరమిగలలేదని తనకు గుర్తులేదు. ఇంతపప్పు మళ్ళీ పొయ్యి మీదకు ఎక్కించింది. ప్రక్కవాటాలో నవ్వులు. అవునుమరి కొత్తకాపరం. తన అక్క బావా యిలానే వుండేవారుగా. మరల గతజీవితం కళ్ళముందు కదిలింది.

అక్కయ్య పెళ్ళి వున్నదాంట్లోనే బాగాజరిపేరు. పెళ్ళి అయిన పదో నాడు అక్క బావతో కలిసి కులాసాగా కాపరానికి వెళ్ళిపోయింది. తను వంటరిగా నాన్నను చూచుకుంటూ యింట్లో వుండిపోయింది. ప్రయివేటుగా కట్టి మెట్రిక్కు పాస్ అనిపించుకుంది. పెళ్ళయిన రెండో ఏడు అక్క పురిటికి వచ్చింది. తన పెళ్ళి విషయం నాన్నతో అక్క సంప్రదించడం కూడా విన్నది. అన్నయ్య కూడా ఈ ఆలోచనే చేస్తున్నట్లు తెలిసింది. తను నిర్లిప్తంగా వుండిపోయింది. జరగవలసినవి యధావిధిగా జరగాలిగామరి. అక్క వున్నన్నాళ్ళూ సరదాగా గడిచింది. వచ్చిన నెల్లాళ్ళకు నొప్పులు వచ్చాయి. ఎందుకో అపరిమితంగా బాధపడుతుంది అక్క. మంత్రసాని వచ్చి తెల్లమొగం వేసింది. అన్నయ్యా వదిన కలసి అక్కను ఆసుపత్రిలో చేర్చారు. బావకు తంతి యిచ్చారు. తనకెందుకో బెదురు. కాళ్లుచేతులాడలేదు తనకు. దేవుడి మందిరంచేరి బయటకు రాలేదు నాన్న. రెండురోజులు బాధపడింది అక్క. బావవస్తున్నట్లు తిరుగు తంతి వచ్చింది. ఇంక ఫరవాలేదు అనుకుంది తను. అక్కకు పురుడు రాలేదు. ఆపరేషన్ చేశారు. బిడ్డబ్రతికాడుగాని తల్లిని బ్రదికించలేక పోయారు. తనకు చైతన్యం తప్పింది. పిల్లవాడిని చూచి ముందర తనకు కోపం వచ్చింది. కానీ ఆ తల్లిలేని బోసినవ్వుల పసివానిని చూచి హృదయం ద్రవించింది. 'నీకు తల్లిలేనిలోటు రానీయను బాబూ' అని తను వాడిని హృదయానికి హత్తు

కుంటూ మాట యిచ్చింది. మాట యివ్వడవేమిటి నిలబెట్టుకుంది కూడాను. ఇంతలోనే మరోకలవరం. బావవస్తున్నరైలు పట్టాలు తప్పిపడి పోయింది. చనిపోయిన వారి జాబితాలో బావపేరు వున్నది. పచ్చిపుండు మీద కారంజల్లి నట్లు. అయినా ఒకసంతృప్తి. ఒకబిడ్డకు తల్లి నవ్వుతున్నానన్న సంతృప్తితోనే పోయింది అక్క. భార్యా పిల్లను కలుసుకుంటాననే ఆశతోనే పోయాడు బావ. ఒకరి గురించి మరివొకరికి బాధలేకుండానే జీవన యాత్ర ముగిం చారు భార్యా భర్తలు. ఎంత విచిత్రం. ఒక కలగా అంతా జరిగిపోయింది. తను చిన్నారి రాము భారం వహించింది. తండ్రి అసలు పిచ్చివాడిగా తయా రయ్యాడు. తను అక్క కొడుకుతో అన్నయ్యదగ్గిర వుండిపోయింది. రోజులు నెలలు గడిచిపోయాయి. తను అక్క ఎంతోఅన్యోన్యంగా వుండేవారు. అందుకే అక్క తన సర్వస్వాన్ని తనదగ్గర దిగవిడిచిపోయింది. అక్కసొత్తును తను కాపాడాలి. వాడికి ఉజ్వల భవిష్యత్తు తాను కల్పించాలి. అని ఎన్నో అను కున్నది తను....అన్నయ్య తనకో సంబంధం తెచ్చాడు. తనకు పెళ్ళివద్దని వాదులాడింది. కాని అన్నయ్య వదిన వినలేదు. 'నీజీవితం అయినా ఆనందంగా వుంటే అదే పదివేలు' అని అన్నారు. తన పెళ్ళి అయ్యిందనిపించారు కామరాజుతో. పిల్లవాడి బాధ్యత అన్నయ్య వహించాడు. తను యిల్లాలుగా భర్తతో దూరతీరాలకు వచ్చేసింది. పప్పుమాడి మసిఅయ్యింది. ఇక ఇవాల్టికి భోజనం అంతే....నోచుకోలేదు. అసలు తను జీవితంలో ఏమి నోచుకొని పుట్టింది గనుక. గిన్నెలో నీళ్లపోసి పొయ్యిఆర్పి అన్నంమీద గిన్నె మూతపెట్టి గడప మీద తలపెట్టి కొంగు పరచుకొని నడుంవాల్చింది రమణమ్మ....దోమలరొద. తన మనస్సులో ఆలోచనల రొద....ఎప్పుడూ వున్నవే. ఎడతెగని గతంలోని వూహాపరంపరలు. జవాబులేని ప్రశ్నలు తనను వెన్నంటుతునే వున్నవి. అత్త మామలుగాని మరదళ్లుగాని లేని కొంప ఎవరో ఒకముసలిది దూరపు చుట్టం వుండేయింట్లో తను పగలంతా బిక్కుబిక్కుమంటూ వుండేది. ఎంత సేపు చదువుకున్నా, అల్లికలు అల్లుకున్నా పనిపాటలు చేసుకున్నా యిల్లు చక్క దిద్దినా ప్రొద్దుపోని తన నూతన వివాహజీవితం....ఏ అర్ధరాత్రో అపరాత్రో ఎప్పుడో యిల్లుచేరుకునే భర్త....దగ్గిరకువస్తే సారాకంపు, ఎఱ్ఱనికండ్లు, తనకు భయం వేసేది. నెమ్మదిగా ముసలిదానిచెంతజేరి తను నిద్రకుపక్రమించేది. చాలా రోజులు వ్యభిచారి త్రాగుబోతు జూదరి అయిన భర్తతో జీవితం వెళ్ళ మారింది, ఏ ఆనందం సుఖం లేకుండానే. ఆరోజు భర్తయింటికి రాలేదు. ఒకటి

రెండురోజులు రాకపోవడం అలవాటే కాని వరసగా వారంరోజులు రాకపోయే సరికి భయంవేసింది. నలుగురిలో వాకబుచేయించింది. జాడతెలియలేదు. పదిహేను రోజులకు తన పేర వుత్తరం వచ్చింది. అది భర్త వ్రాసింది. తనకోసం వెదికించ వద్దని తను విసిగి సన్యాసులలో కలిశానని మనస్సు కుదురుతే వస్తానని దానిసారాంశం, తన వైవాహిక జీవితానికి ముగింపువాక్యం.........ప్రేమకు మమతకు ఎప్పుడూ నోచుకోని తన జీవితంలో యింకో మలుపు. అన్నయ్యకు ఉత్తరం వ్రాసింది. తన సంసారం గడవడమే ఘనంగా వుందని రామూని కూడా పెంచి పెద్దచేసే భారం ఒకటుందని తను అత్తవారింట వుండడమే మంచిదని జవాబు. ఆద్వారం కూడా మూసుకుంది తనకు. తండ్రిలేడు అప్పటికి మావయ్య పట్టించుకోడు....ఇంకెవ్వరున్నారు తనకు....భుక్తికోసం బడిపంతులమ్మ అయ్యింది. వచ్చే జీతంరాళ్లు పొదుపుగా ఖర్చుచేసి మిగిల్చి రాముకోసం అన్నకు మనియార్డరు చేసేది నెలనెల....మనియాడర్ల కూపన్లు యింకా తన టిన్ను ట్రంకు పెట్టిలో వున్నవి. తనలాగే త్రుప్పుపట్టుతూ. నెలలు సంవత్సరాలు దొర్లిపోయాయి. దినచర్యలో ఏ మార్పులేదు. కదలికలు లేని జీవితం వున్నట్లుండి రామూ పిన్నిని చూడాలని ఉబలాట పడుతున్నాడని వాడిని పంపుతున్నానని ఉత్తరం. రాము తనరాము....అప్పుడే యిరవై ఏండ్లవాడు.... అబ్బా తనదగ్గరకు వస్తాడా....సంతోషంతో నలుగురికీ చెప్పివచ్చింది. ఉత్తరం చూపించింది. ఆరోజుకోసం ఎదురుచూస్తూ కూర్చుంది. రాము వచ్చాడు నూనుగుమీసాల ఆసామి.... 'పిన్ని కాదు 'అమ్మా' అనినోరారా పిలిచాడు. తాను ఎంతో సంబరపడిపోయింది. సరదాగా కబుర్లు చెప్పేరాము అక్కను గడియగడియకి గుర్తుకు తెచ్చాడు. 'నీతోనే వుంటాను' అన్నాడు రాము 'తన జీవితానికి వెలుగు' అనుకుందితను....సిగరెట్లు కాలుస్తున్నాడు రాము. ఇప్పటి కాలం కుర్రాళ్ళులే అని తనను తాను సమాధాన పరచుకుంది. రాత్రిళ్ళు ఆలస్యంగా రావడం మొదలుపెట్టాడు. అదేమని అడుగుతే స్నేహితులతో బయటకు పోయాననో సినిమాకు వెళ్ళినాననో బుకాయించాడు. సరేలెమ్మని వూరుకుంది తను. ఒకరోజు జులాయి వెధవలతో బ్రాందీబుడ్లతో యిల్లుచేరుకొని పేకాటకు డబ్బుగుంజుకున్నాడు. అన్నకు రామూ వ్యవహారం వ్రాసింది. 'నీదగ్గరవుంటే బాగుపడతాడని పంపించాను' అని మారుటపాలో జవాబు....అవునుమరి తను తల్లిస్థానంలోవుంది. వాడిని మందలించాలి. పట్టుకొని మందలించింది ఒకరోజు మాటవినినట్లే అనిపించాడు. నాలుగురోజులు బుద్ధిగావున్నాడు....'అమ్మయ్య'

అనుకుంది. ఒకరోజు రాము పెట్టిబెడా సర్దుకుంటున్నాడు........'ఎక్కడికిరా'? అన్నది తను....'తనకు ఉద్యోగం దొరికిందని పిన్నికి కష్టంఎందుకని మరో యిల్లు చూచుకున్నాడని త్వరలో ఎవరో ఎల్లమ్మను పెండ్లిఆడుతున్నాడని.... అడపాతడపా వస్తానని' తనకు గుక్కతిరగనివ్వకుండ జవాబిచ్చి ప్రత్యుత్త రానికైనా ఎదురుచూడకుండా గుమ్మందాటి వెళ్ళాడు రాము....యిప్పటికి మళ్ళీ ఈ గుమ్మంఎక్కలేదు. రోజులు నెలలు సంవత్సరాలు గడిచిపోయాయి. కాని తన నిరీక్షణ యింకాముగియలేదు. తనజీవితంలో ఎంతోమంది ఆమెహృదయం మీద బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయారు. ఏ వొక్కరూ తిరిగి రాలేదు. అయినా ఈ మమతలులేని మానవులకోసం కళ్ళలో వత్తులువేసుకొని చూస్తూవుంటుంది రమణమ్మ....మెట్లదగ్గర చప్పుడు తలఎత్తిచూచింది పిల్లి కాబోలు చీకట్లో కలసిపోయింది. వూర్లో సద్దుమణిగింది. పనిమాలి అరిచే వీధి కుక్కల అరుపులు అప్పుడప్పుడు వినిపిస్తోంది. చలిగాలికి ముసలిశరీరం కొంచెం వణికింది. 'చాలా రాత్రిఅయ్యింది యింకెవ్వరు వస్తారులే' అని తలు పులు వేసుకుంది రమణమ్మ. జీవితంలోని మరియొకరోజు జారిపోయింది.... అంతులేని నిరీక్షణ జాబితాలో ఒకరోజు తగ్గిపోయింది.



# బడుగు బ్రతుకు

## ఎం. జానకిరామ్

'ఏయ్, వీరయ్యా, ఇలారా' అని రాజారావు పిలవగానే భుజాన వేసుకున్న తువ్వాలుగుడ్డను తలకు చుట్టుకొని వీరయ్య ఆదరాబాదరా లోనికెళ్ళి రాజారావు యెదుట చేతులుకట్టుకొని నిలుచున్నాడు. రాజారావతని చేతిలో ఓ వంద రూపాయలనోటును, ఓ చీటీని యిచ్చి అందులో రాసున్నవన్నీ త్వరగా తీసుకు రమ్మని పంపాడు. 'అట్టాగేనయ్యా!' అంటూ కిటికీ ప్రక్కనున్న సంచిని తీసుకొని వీరయ్య వీధినపడ్డాడు.

రాత్రి తొమ్మిది దాటుతున్నా యింటికెళ్ళే భాగ్యానికి నోచుకోని వీరయ్య బజారువేపు నడుస్తూ దీపస్తంభం క్రిందనిల్చుని ఆ పూటకి అయ్యగారి అవసరాల చీటీని చూశాడు. 'నాల్గు కింగ్‌ఫిషర్ బీరుబాటిళ్ళూ, స్కాచ్ విస్కీ హాఫ్‌బాటిలూ, రెండు క్వార్టర్లు జిన్నూ, మూడు ప్లేట్లు మటన్‌బిర్యానీ. చికెన్ సిక్స్‌టీఫైవ్, ఫిష్‌కట్లెట్, ఎగ్‌మసాలా, క్యాషూనట్స్, చిప్స్' అని రాసుంది అందులో. అవన్నీ తేవడానికి ముందుకుసాగాడు. ముందుగా వైన్‌షాపులో దూరి డ్రింక్స్ అన్నీ పార్సిలు కట్టించి, దాని తాలూకు బిల్లుతోసహా సంచిలో వేసుకొని హోటలు ఎవరెస్టుకి బయలుదేరాడు.

దారిలో ఓమారు యింటికెళ్ళి పెళ్ళాంచేతికి రెండురూపాయలిచ్చి వద్దామా అని ఆలోచించాడు. ఆ పూట కనీసం పిల్లలకైనా తిండి సమకూర్చాలని. తన యిరవై ఏళ్ళ సర్వీసులో అలాంటి కక్కుర్తి పనులెప్పుడూ చేయలేదు వీరయ్య. నిజాయితీకోసం పడిచస్తూ, కలో, గంజో తాగుతూ అదీలేని పూటల్లో పస్తులైనా వుంటూ సేవాధర్మాన్ని నిర్వర్తిస్తున్నాడు. కాని ఆరోజువరకు యింకా నెలజీతం ముట్టలేదు. వీరయ్య అర్ధాంగి నరసమ్మ అప్పుడప్పుడు ఏదో కూలిపని చేస్తూ కుటుంబపోషణలో వీరయ్యకి సాయపడ్తుండేది ముగ్గురుపిల్లల తల్లయినా. కానీ నాలోరోజుల్నించీ నరసమ్మ వొంట్లో నలతగా వుంటున్నందున పక్కింటి పుల్లమ్మ 'ఫలానాచోట కూలి దొరుకుద్ది రమ్మన్నా' నిస్సత్తువతో నిల్చిపోయిందింట్లోనే. ఇంట్లో నూకల్లేవు. ఇరుగింట్లో, పొరుగింట్లో నూకలూ, జొన్నలూ అరువుతెచ్చి పూట గడుపుతూవుంది నరసమ్మ. ఇక అలాంటి అరువుకూడా పుట్టనిరోజుల్లో

పడింది వీరయ్య బడుగు బ్రతుకు. అందుకే యీ ఆలోచన కల్గిందతనికి. అవసరానికి తలొగ్గుదామనుకున్నా రావణాసురుడులాంటి రాజారావుని తల్చుకొంటే వున్న కంటింజంటు వుద్యోగంకూడా వూడిపోతుందనే భయంతో వీరయ్య కాళ్ళు అతణ్ణి నేరుగా హోటల్ ఎవరెస్టుకే నడిపించాయి. ఆలూ చిప్సుతోసహా అక్కడ కావలసినవన్నీ కట్టించుకొని బిల్లు రాయించుకొని పైకం చెల్లించాడు. అంతాపోతే ముప్పావలా మిగిలింది. దాంతో పాన్‌షాపులో మూడు స్పెషల్ కిళ్ళీలు కట్టించుకొని ఆఫీసుకొచ్చాడు.

అప్పటికే తన అయ్యగారి కెదురుగ్గా నరసింహమూర్తి, కుమారస్వామీ ఆసీనులై వున్నారు. వీరయ్య లోనికెళ్ళి రాజారావు రిటైరింగు రూములో టేబిలు మీద అన్నీ సర్ది మూడు కుర్చీలు అమర్చాడు. రాజారావు వద్దకొచ్చి, 'మిగిలిన పైకానికి కిళ్ళీలు పట్టుకొచ్చానయ్యా' అంటూ బిల్లులన్నీ యిచ్చాడు. 'సరే నువ్వు బయటే వుండు' అని మిత్రులిద్దరితో లోపలికెళ్ళాడు రాజారావు. వీరయ్య బయట వరండాలో బెంచీమీద చతికిలబడ్డాడు. లోపల అయ్యగార్లు ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటూ, జోక్స్ కట్ చేసుకొంటూ, లోకాభిరామాయణం చెప్పుకుంటూ డ్రింకులు కలుపుకొని, కాక్‌టెయిల్ చేసుకొని రకరకాల తినుబండారాలను నంజుకుంటున్నారు.

వీరయ్యకు తన ఆకలిసంగతెట్లున్నా యింట్లో పిల్లల ఆకలీ, భార్య అనారోగ్యం పైనపడి మనస్సు కొట్టుకలాడుతూవుంది. అయ్యగార్లు తినగా మిగిలిందేమైనా వుంటే మూట కట్టుకెళ్ళి పిల్లలకైనా కనీసం అర్ధాకలి తీరుద్దాం అనే సాకుతో కునికిపాట్లు పడుతున్నాడు. అయ్యగార్లు తాగడం తినడం పూర్తయ్యే సరికి మరో గంటన్నరైనా పడుతుంది. పొద్దట్నుంచి తిండిలేక తనకే కళ్ళు బైర్లుకమ్ముతున్నాయి. ఇక యింట్లో పిల్లలు నేలకఱచుకొని పడివుంటారు. మరో పదిహేను నిమిషాలకి ఓకుక్క తోక ఆడించుకుంటూ వచ్చి వరండాలో వీరయ్య ప్రక్కన చేరింది. దాన్ననుసరించి దాని పిల్లలు రెండు కుఁయ్ కుఁయ్ మంటూ వచ్చాయి. అవెక్కడ లోపలదూరుతాయో అని వీరయ్య 'ఛయ్, ఛయ్ పో, పో' అంటూ వాటినదిలించాడు. అవేమో వరండా దిగి బయల్లో ఒక ప్రక్కగా తిష్ట వేసుకున్నాయి.

మధ్యాహ్నం అయ్యగారి కారియర్‌లో కూడా ఏమీ మిగల్లేదు. ఒకవేళ ఎప్పుడైనా కాసిని అన్నంమెతుకులూ. చారునీళ్ళూ మిగిలినా కారియరు తెచ్చే పని పిల్లపాలు గావడంతప్ప వీరయ్యకు దక్కడంలేదు. ఎప్పుడైనా అయ్యగారి

డ్రింకుపార్టీల్లో ఏమైనా తిండి మిగిల్తే తీసుకెళ్ళేవాడు. ఇక్కడ యీపూటేమైనా మిగిల్తే తీసుకెళ్ళి నిద్దరోతున్న పిల్లల్ని లేపి తినిపించాలనుకున్నాడు.

ఇరవైఏళ్ళుగా అదే ఆఫీసులో పనిచేస్తున్న వీరయ్యకి అప్పటికి నలుగురు ఆఫీసర్లు మారారు. రాజారావుకిమల్లే ముందటివాళ్ళూ డ్రింకులూ అవీ తెప్పించుకొనేవాళ్ళే. అయినా ఎవళ్ళూ వీరయ్య చేతిలో చిల్లర డబ్బులుకూడా పెట్టే వాళ్ళుకాదు బక్షిష్‌గా. హోటల్ ఎవరెస్టుకి అయ్యగార్లకు తిండిపొట్లాలు తెచ్చే వీరయ్యకు అందులో ఒకసారికూడా కనీసపు తిండితినే యోగ్యతరాలేదు. అక్కడ సర్వర్లకు కస్టమర్లనుండి బక్షీషులు లభిస్తుండడం ఎన్నోసార్లు చూశాడు. కాని తను రాత్రి ఎంతో పొద్దుపోయిన తర్వాతకూడా అయ్యగార్లకు అన్నీ అమర్చిపెట్టి సేవచేసినా పావలా డబ్బులుకూడా ముట్టేవికాదు వీరయ్యకి. అయినా బాధ పడేవాడుకాదు. అదంతా తన వుద్యోగ ధర్మంలో ఒక భాగమనుకొనేవాడు. తమకడుపులు మాత్రం సుష్టుగా నింపుకుని యెదుటివాడికడుపు సంగతి యేమాత్రంఆలోచించని అయ్యగార్ల అదృష్టానికి వీరయ్య అసూయ పడేవాడేకాదు.

గంట పదిన్నర దాటింది. మరో అరగంటగ్గానీ లేచేట్టులేరువాళ్ళు. బయట నాలుగోమానవుడున్నాడనే యింగితజ్ఞాన మెవరికీ లేదాముగ్గురిలో. అంతస్థుకూ హోదాకు తగదని డ్రింకులో సుక్కైనా యివ్వకపోయినా 'ఒరే వీరా, యింద యీరొట్టెముక్క తిను' అనడానికి కూడా నోరురాదు అలాంటి వాళ్ళకి. అసలే నాల్గవ తరగతికంటె క్రిందివుద్యోగస్తుడైన వీరయ్య ఎంత చాకిరీ చేసినా తనకుటుంబానికి సరిపడే తిండి సమకూర్చలేని ఆదాయం. పూటకి నూర్రూపాయలైనా ఖర్చుచేసే ఔన్నత్యం తన అయ్యగారిది. అది చూస్తూ తనస్థితికి తానే జాలిపడ్డం తప్ప యితరుల నుండి పిసరంతైనా జాలి పొందలేని హీన మానవుడు వీరయ్య. తన యిరుగుపొరుగు వాళ్ళూ యించుమించు అలాంటి పరిస్థితుల్లోనే వున్నారు. తమకారాత బ్రహ్మదేవుడే రాసిపెట్టాడో, సమాజమే రాసిపెట్టిందో ఆలోచించే శక్తి బడుగుబ్రతుకు సాగించే వీరయ్యలాంటివాళ్ళకు లేదు.

ఠాణాలో గంట కొట్టారు. రాజారావుగారు బ్రేవ్‌మని త్రేన్చుకుంటూ బయటికొచ్చి 'ఒరేయ్ వీరా, సీసాలూ అవీ తీసేసి గదంతా శుభ్రంగా తుడిచేయ్' అని ఆర్డరు జారీచేశాడు. మిగిలిన యిద్దరుకూడా తూలుతూ సోలుతూ బయటపడ్డారు. వీరయ్యలోపల అన్నీ సర్ది పరిశీలనగా చూశాడు. కనీసం

చిప్ప ముక్కలుకూడా మిగిలివుండలేదు. టేబిలుచుట్టూ, క్రిందా కూడా అన్నీ నమిలిపారేసిన ఎముకలే కనబడ్డాయి. అన్నిటినీ ఏరి పొట్లాల కాగితాల్లో, ఆకుల్లో మడచి బయట దూరంగా పారేశాడు.

కాంపౌండు బయల్లో వుండిన కుక్కా దానిపిల్లలూ వీరయ్యవెంటనే బయటికొచ్చి పారేసిన యెముకల్ని కొరుకుతూ కాలక్షేపం చేయసాగాయి. అది గమనించి కనీసం కుక్కగానైనా పుట్టకపోతినే అని వీరయ్య మనస్సు కొద్ది క్షణాలపాటు ఆక్రోశించింది. చేసేదిలేక వెనుదిరిగి వచ్చి ఆఫీసు తలుపులూ, కిటికీలూ మూసి తాళంవేసి తాళం చేవుల్ని అయ్యగారికిచ్చాడు. అప్పటికే రోడ్డుమీద గూర్ఖా లాఠీ టకటకలాడిస్తూ గస్తీ తిరుగుతున్నాడు.

రాజారావు మిత్రద్వయంతో బయలు దేరాడు. వీరయ్యనెమ్మదిగా 'అయ్యగారూ, ఓ రెండు రూపాయలిప్పించండి!' అన్నాడు. 'ఒరేయ్! సమయం సందర్భం లేకుండా ఎప్పుడుబడితే అప్పుడు అడగడమేనేట్రా! ఇప్పుడు చిల్లరలేదు తర్వాత చూద్దాంలే వెళ్ళు వెళ్ళి ప్రొద్దున్నే ఏడింటికల్లా వచ్చేయ్' అంటూ ముందుకు సాగాడు. వీరయ్య కాళ్ళీడ్చుకుంటూ గుడిసె చేర్చుకున్నాడు. ఎప్పుడో నిద్రాదేవి అక్కునపడివున్న పిల్లల్నీ, భార్యనీ చూశాడు. తన వేడి నిట్టూర్పులను మాత్రం వాళ్ళకు ప్రసరింప చేయగలిగాడు. కళ్ళు మూతలు పడుతున్నందున చింకిబొంతను విప్పటీసి పరచుకొని మేనువాల్చాడు. అంతలో అయిదేళ్ళకూతురు లేచి కళ్ళు నులుముకొంటూ నీళ్ళు అంటూ రాగంతీసింది. వీరయ్య నెమ్మదిగా లేచి సొట్టలగ్లాసుతో మట్టికుండలోని నీళ్ళు తీసుకొని ఆకలితోవున్న ఆ పిల్లనోటికి బిర్యానీ తెచ్చిన చేతుల్తోనే కేవలం మంచినీటిని మాత్రమే అందించాడు. ఆ అమ్మాయి నాన్నను గుర్తించి 'నాన్నా ఆకలేస్తూంది' అంటూ పొట్టచేత్తో పట్టుకుంది. వీరయ్య గొంతులో వొణుకును స్పష్టపడనీకుండా 'ఇప్పుడు చాలా రాత్తిరయింది. తెల్లారనీయమ్మా, పడుకో' అన్నాడు తన బ్రతుకు తెల్లారుతుందోలేదో తెలియని వీరయ్య.



# కథలాంటి జీవితం

## సి. మురళీధరరావు

'బాబూ! పరంధామయ్యగారున్నారా?'

షేక్స్పియర్ నవల, చదువుతున్న నేను తలెత్తిచూసాను. ఎదురుగ్గా, ఒక వృద్ధుడు, దాదాపు అరవయి సంవత్సరాలుండవచ్చు, నిలుచునివున్నాడు.

అతన్ని పరీక్షగా చూసాను. అతడి ముఖంలోని ముడుతలు, నెరిసిపోయిన తలవెంట్రుకలు, అతడు జీవితంలో బాగా ఢక్కా మొక్కీలు తిన్నవాడని చెప్పడానికి నిరూపణగా వున్నాయి. ఆ కళ్ళల్లో ఏదో దీనత్వం, నైరాశ్యం గూడు కట్టుకున్నట్లుగా అనిపించింది నామటుకునాకు. అతడి చేతిలో పసుపురాసిన కవరొకటి వుంది. శుభలేఖకాబోలు అనుకున్నాను, మనసులోనే.

'ఇంట్లోలేరండి. ఎవరోవస్తేనూ, బయటికెళ్ళారు. కూర్చోండి, కొద్దిసేపట్లో రావచ్చు' అంటూ కుర్చీచూపించాను.

అతడు కూర్చోకుండానే, 'ఈ పెళ్ళిపత్రిక రామన్న పంతులిచ్చాడని చెప్పిఇవ్వు నాయనా! నాకింకా అవతల బోలెడుపనులున్నాయి. మా అమ్మాయి పెళ్ళిఘనంగా చేయాలని వుంది. పెళ్ళిపందిరికూడా వేయించాలి యింకా! అంటూ, ఆ పెళ్ళిపత్రిక నాచేతికందించి, వెళ్ళిపోయాడు.

ఎంత వేగంగా వచ్చాడో అంత వేగంగానూ వెళ్ళిపోయిన ఆ ముదుసలిని చూస్తూ కూర్చుండిపోయాను. అతన్నెప్పుడూ చూచినట్లు గుర్తులేదునాకు. హైద్రాబాదులో బి.ఏ. చదువుతున్ననేను, వేసవిసెలవులకు, యింటికి రమ్మని, మామయ్య వుత్తరం వ్రాస్తే ఈ పల్లెటూరికి వచ్చాను. ఎప్పుడో చిన్నతనంలో చూసిన వూరు. బాగా మారిపోయింది. అప్పట్లో దాదాపు అన్నీ గుడిసెల మాదిరిగానే వుండేవి. ఏ ఒకటో, రెండో మామయ్యగారిల్లు లాంటి పెంకుటిళ్ళు తప్ప. ఇప్పుడు ఈ వూరులో ఒక గవర్నమెంటు ఆస్పత్రి, రెండు స్కూళ్ళు, సినిమాహాలు, ఓ అయ్యరు హోటలు వెలిసాయి. ఎన్నిమార్పులు వచ్చినా, ఆ పచ్చని పొలాలూ, పచ్చికబయళ్ళూ మాత్రం అలాగే వున్నాయి. సహజంగా నాకు పల్లెటూళ్ళంటే చాలా యిష్టం. అందుకే మామయ్య వుత్తరం వ్రాయగానే, రెక్కలు కట్టుకు వాలాను.

ఆనాటి రాత్రి, భోజనాలయ్యాక ఆరుబయట మంచాలు వేసుకుని కూచున్నాం, నేను మామయ్యా.

తెల్లని మల్లిపువ్వులాంటి వెన్నెల, రతీదేవితో పోటీకి వస్తోంది. చల్లని పిల్లగాలులు మనసుకు హాయిని గొలుపుతున్నాయ్. చందమామ ఆకాశమంతా వీరవిహారం చేస్తున్నాడు. కాని, అప్పుడప్పుడు మబ్బులచాటున దాగొనక తప్పటం లేదు. ఆ వెలుగు నీడలను చూస్తున్ననాకు, రామన్నపంతులు ముఖం లోని ఏదో చెప్పలేని విషాదం, మరో ప్రక్క కూతురిపెళ్ళి చేయబోతున్నాననే వుత్సాహం మనసులో మెదిలాయి.

మామయ్యను నేనడిగిన ప్రశ్నకు జవాబుగా నిట్టూర్పు వినిపించింది.

'వెళతావా మరి, పెళ్ళికి? ఇంతకీ ఎవరతను?' ఆసక్తిగా అడిగాను.

'పెళ్ళికూతురు లేకుండా పెళ్ళేమిటిరా? పాపం! పిచ్చిరామన్న, ప్రతి ఏడూ శరత్ పూర్ణిమ నాడు, కూతురికి పెళ్ళిచేయాలని ఎంతో ఆర్భాటం చేస్తాడు కాని, చనిపోయిన వారికెవరైనా పెళ్ళిచేయగలరా?

మామయ్య మాటలు నా కర్థంకాలేదు.

'నీవు చెప్పేదేమిటో నా కర్థంకావటం లేదు మామయ్యా! కాస్త వివరంగా చెప్పు! అడిగాను నేను.

అదంతా ఒక పెద్దకథరా మూర్తీ' అంటూ చెప్పడం మొదలెట్టాడు మామయ్య.

ఆఊరిలో రామనాథం ఒక బడిపంతులు. ఎంతో విశాలమైన హృదయం, మంచితనం గలరామనాథం గారంటే ఆ ఊరిలో వారందరికీ ఎంతో గౌరవం. గౌరవంతోనూ, అభిమానంతోనూ, 'రామన్నపంతులూ' అని పిలిచేవారాయన్ని. ముప్ఫయి సంవత్సరాలుగా ఆ ఊరిలో ఉపాధ్యాయుడుగా వుంటూ, ఎంతో మంది పేదవిద్యార్థులకు భవిష్యద్బాటను సుకరంచేసిన రామన్న అందరి ప్రేమకూ పాత్రుడయ్యాడంటే ఆశ్చర్యంలేదు.

ఆయనకు పెళ్ళయిన అయిదు సంవత్సరాలకే భార్యపోయింది. ఒక్కగా నొక్క కూతురు కల్యాణిని ఎంతో ప్రేమగానూ ఎంతో గుణవంతురాలుగాను పెంచి పెద్ద చేసారాయన. కళ్యాణి అందంలోను, చదువులోనూ తనను మించినవారు ఆ చుట్టుప్రక్కల లేరని అందరి మన్ననలను పొందింది. ఇన్నేళ్ళుగా కష్టపడి పెంచినందుకు, తనపేరు నిలబెట్టిందని గర్వపడేవాడు రామన్నపంతులు.

ఇప్పుడు రామనాథంగారికున్న బాధ్యతల్లా కూతురిపెళ్ళి చేయడమే. అదో శుభకార్యం జరిగిపోతే, తాను హాయిగా, కృష్ణా, రామా అనుకుంటూ కాలం గడపవచ్చునని. ఆ ప్రయత్నంలో పడ్డాడు రామన్న. వెదకి, వెదకి పెద్దాపురం పెదనరసయ్య సంబంధం ఖాయపరిచారు. వరుడు బుద్ధిమంతుడు,

చదువుకున్నవాడు. కాని పేచీఅంతా కట్నందగ్గిరే వచ్చిపడింది. వరుడిపై పు వాళ్ళు ఏడువేల రూపాయల కట్నం, మూడువేల రూపాయల ఖరీదుచేసే లాంఛ నాలు కోరారు. కాని రామనాథంగారి దగ్గిరున్న సొమ్ము రెండువేలు మాత్రమే. ఏమయినా, అంతకంటె మంచిసంబంధం తానుతేలేనని తెలిసిన రామనాథం గారు ఎంతకష్టమయినా, పెళ్ళి జరిపించాలని నిశ్చయించుకుని, వీరుకోరినవాటి కన్నిటికీ ఒప్పుకున్నారు.

పెళ్ళి ఖాయపరిచారేకాని, పదివేలు తానెక్కడినుంచి తేగలడు? రామ నాథం గారికి భయంపట్టుకుంది. వారినీ, వీరినీ అడిగి, అందరూ తెలిసినవారు కనుక మూడువేలు సంపాదించగలిగారు. ఆ తరువాత, యికఅప్పుతేలేక నిరాశా నిస్పృహలు ఆ వృద్ధుణ్ణి ఆవరించాయి.

పెళ్ళి దగ్గరపడుతోంది. రామనాథం గారికి కంగారెక్కువయింది. చిన్ననాటి స్నేహితుడొక్కడు అదృష్టవశాత్తు తారసపడి పెళ్ళినాటికి తాను అయిదు వేలు సర్దగలనని హామీ యిచ్చాడు. రామనాథం గారికి సగంభారం తగ్గినట్లయింది.

శరత్ పూర్ణిమ వచ్చింది. ఇల్లాలు లేని రామనాథం గారిల్లు, పచ్చని తోరణాలతో, పసుపు కుంకుమలతో కళకళలాడింది.

రామనాథంగారికి చెప్పుకోదగ్గ బంధువులెవరూ లేరు! రామనాథం గారికి వరుసకు చెల్లెలయిన ఒక ముసలావిడ మాత్రం వచ్చింది పెళ్ళికి.

పెళ్ళిదుస్తులలో కూతుర్ని చూసుకుని రామనాథంగారు మురిసిపోయారు.

పెళ్ళిరోజు వచ్చింది. రామనాథంగారిల్లు హడావిడిగా వుంది. ముహూర్తం సమీపించేకొద్దీ రామనాథంగారు ఆతృతగా వసారాలో పచార్లు చేయసాగారు. అప్పిస్తానన్న వ్యక్తి యింకారాలేదు. రాత్రితొమ్మిది గంటలకు ముహూర్తం. అయిదూ, ఆరూ, ఏడూ, ఎనిమిది గడచినా ఆ వ్యక్తి అంతూ పంతూలేడు. రామనాథంగారి ఎడమకన్ను అదరసాగింది. కాళ్ళు వణుకు తున్నాయ్. ఇంట్లో శుభకార్యం జరుగుతుందో లేదోనని ఆదుర్దాతో రామనాథం గారి గుండె కొట్టుకోసాగింది.

'ముహూర్తం వేళ సమీపిస్తోంది. అమ్మాయిని తీసుకరండి' పురోహి తుని మాటలు చెవినబడి రామనాథంగారికి ఆచల్లని వేళలో కూడా ముచ్చెమటలు పోసాయి.

'వస్తానన్న వ్యక్తిరాలేదు. ఇక ఆలస్యం చేయకూడదు. వియ్యంకుణ్ణి ప్రాధేయపడడ మొక్కటే మార్గం అనుకున్న రామనాథంగారు వియ్యంకుడి దగ్గిరకెళ్ళి సంగతి వివరించారు.

'ప్రస్తుతానికి ఏడువేలు మాత్రం యివ్వగలను. మిగిలింది. వివాహ మయ్యాక కొద్ది కాలంలోనే యిస్తానని బ్రతిమాలారు.'

'ఏంటయ్యా? పెద్దమనిషివిగదాని ఈ సంబంధానికొప్పుకుంటే ఈ విధంగా మోసం చేస్తావా? 'కో' అంటే కోటిమందివచ్చి కాళ్ళమీద పడతారు, పిల్లనిస్తామని! మర్యాదగా డబ్బంతా ఒక్కటేసారి యిస్తే సరి! లేదంటే వేరేసంబంధం చూసుకుంటాం!' ఖండితంగా పలికిన వరుడి తండ్రి మాటలకు రామనాథంగారి ముఖం చిన్నబోయింది.

'బాబ్బాబూ! ఇవి చేతులుకావు! కాళ్లు! నా మర్యాద కాపాడండి! మీకు ఆజన్మాంతం కృతజ్ఞుడనై వుంటాను. నా ఒక్కగానొక్క కూతురి భవిష్యత్తు మీ చేతిలో వుంది. ఆ అమాయకురాలికి అన్యాయం చేయకండి!' అంతవరకూ బలవంతంగా దిగమ్రింగుకున్న దుఃఖం ఒక్కసారి పొంగుకొచ్చి భోరున ఏడ్చేశారు రామనాథంగారు.

వియ్యంకుడు ఏమాత్రం చలించలేదు. చివరికి ఇరుగుపొరుగువారు ఎంతో చెప్పిచూడగా ఒక షరతుమీద పెళ్ళిజరగడానికి ఒప్పుకొన్నారు.

'వధువువైపువారు నెలరోజుల్లో కట్నండబ్బు పూర్తిగా అందచేయకపోతే పెళ్ళికూతురు పుట్టింటివైపు కన్నెత్తి చూడడానికి వీలులేదు.'

పెళ్ళి యథాతథంగా జరిగిపోయింది. కూతురు అత్తవారింటికి వెళ్ళిపోయే టప్పుడు రామనాథంగారు పసిపిల్లాడిలా ఏడ్చారు. విడవలేక విడవలేక, కళ్యాణి తండ్రిని విడిచి వెళ్ళిపోయింది.

పక్షంరోజులు గడిచిన తరువాత, ఒకరోజున రామనాథంగారు కూతురిని చూద్దామనే ఉత్సుకతతో వియ్యంకుడి యింటికెళ్ళారు. అరుగుమీద కూర్చుని దంతధావనం చేసుకుంటున్న వియ్యంకుడు రామనాథంగారిని చూడగానే ముఖం వికసించిందిగాని, ఆతర్వాత గంటసేపట్లోనే ధుమధుమలాడుతూ మండిపోయింది. డబ్బు సర్దుబాటుకాక, ఆ విషయం వియ్యంకుడికి చెప్పి, మరో నెలరోజులు ఓపికపడితే ఏదోరకంగా తెచ్చి సర్దుతానని ముందుగా చెప్పుదామని వచ్చాడు. ఆ సంగతి తెలిసిన తర్వాత వియ్యంకుడి ముఖం మారిపోయింది. ఇంట్లో భోజనాలదగ్గర డబ్బువిషయం ఎత్తి మాటల్తోనే దెప్పిపొడిచాడు. అంత తాహతు లేనప్పుడు పెళ్ళిచేయడం ఎందుకన్నాడు. పదిమందినీ యాచించి పెళ్ళిచేయడం కన్న వున్నప్పుడే చేస్తే పోలా అని దెప్పిపొడిచాడు.

ముసలాయన ఆ సూటీపోటీ మాటల్ని ఎలాగో భరించి, నాలుగురోజులు వుందామనుకున్నవాడు రెండోరోజునే ప్రయాణమై వెళ్ళిపోయాడు.

తిరిగి వచ్చిన వారంరోజులకు మొత్తంమీద డబ్బు సర్దుబాటు అయ్యింది. ఐదువేలూ సర్దుతానన్న అతను డబ్బు తెచ్చి యిచ్చాడు. వాళ్ళ మావగారికి సీరి

యస్ అయితే వూరువెళ్ళాడట. అందువల్ల సమయానికి డబ్బు సర్దలేక పోయానని ఆలస్యమైందని చెప్పి ఐదువేలూ తెచ్చి యిచ్చాడు.

'తీసుకున్న మొత్తం తీసుకున్నట్లుగా. వియ్యంకుడి కిచ్చి రావడానికి వెళ్ళిన రామనాథంగారు వియ్యంకుడి యింటిలోపలినుండి ఏడుపులూ పెడబొబ్బలూ వినిపించగానే కంగారుగా లోపలికి పరిగెత్తారు ఎదుటి దృశ్యం చూసి స్థాణువులా నిలుచుండిపోయారు.

'మనల్ని అన్యాయం చేసి వెళ్ళిపోయిందండీ కల్యాణి. పచ్చగన్నేరు విత్తులు మింగి చనిపోయింది. అంటూ రామనాథంగారిని చూడగానే యింకా పెద్దగా ఏడవసాగింది రాంభాణవ్మ. అవన్నీ కల్లబొల్లి ఏడ్పులని తెలుసుకోలేని అజ్ఞానుడు కాదు రామనాథం.

'మీరే చంపారు, నా కన్నతల్లిని, మీరే చంపారు అన్నెం పున్నెం ఎరుగని బంగారుతల్లిని చేతులారా హింసించి. హింసించి మీరే చిత్రవధ చేసారు. కోపంతో కందగడ్డలా మారింది రామనాథంగారి ముఖం.

'తీసుకోండి, మీక్కావలసిందిడబ్బే, డబ్బే మీ సర్వస్వం, తీసుకోండి'.

గదినిండాపడివున్న నోట్లవంకా, రామనాథంగారివంకా నోరు తెరుచుకుని చూస్తూండిపోయారు వియ్యంకులు.

'కల్యాణీ, వస్తున్నాతల్లీ, నీకు తోడుగా వుండడానికి నీ తండ్రిని, స్వయంగా వస్తున్నానమ్మా, అహ్హాహ్హాహ్హా.... పెద్దగా, పిచ్చివాడిలా అరుస్తూ రామనాథంగారు రివ్వున బయటికి పరుగెత్తారు.

'రామనాథంగారికి పిచ్చిపట్టింది' అనేవార్త దావానలంలా వ్యాపించింది.

'అప్పటినుండి ప్రతి శరత్పౌర్ణిమనాడు, కూతురి పెళ్ళి చేస్తున్నానంటూ పెళ్ళి పత్రికలు యివ్వడమో, పెళ్ళికి రమ్మని పిలవడమో చేస్తారు.'

'చెప్పడం ఆపి మామయ్య, నావంక చూసాడు. చిత్తరువులా, శ్రద్ధగా, వింటూ కూర్చున్న నా భుజం తట్టి ఈ లోకంలోకి తీసుకువచ్చాడు. ఆరాత్రి కలతచెందిన మనసుతో రామన్నపంతులు కళ్ళముందు మెదులుతూంటే, ఆలోచిస్తూ, పక్కమీదికి ఒరిగాను.

నెలరోజుల తర్వాత హైద్రాబాదుకు తిరిగి వచ్చిన నాకు మామయ్య వ్రాసిన వుత్తరంలోని ఒకే ఒక వాక్యం మనసును కలచి వేసింది.

'రామనాథంగారి శవం ఊరి పొలిమేరలోని చెరువులో తేలుతుండగా చూశారు.

ఉత్తరం చదువుతున్న నాకళ్ళనుండి జారిన కన్నీటి చుక్కపడి 'రామనాథం' పేరు చెరిగి పోయింది.



# చీకటిలో చిరుదీపం

కె. వి. రాంప్రసాద్

పైన దశమి వెన్నెలను చిందిస్తూ చందమామ. చుట్టూ అడవులూ, కొండలూ-ఎత్తు పల్లాలతో అస్పష్టంగా కనపడే కంకరరోడ్డు దాటి సాగిపోతున్నాయి-మా సైకిళ్ళు-అర్ధరాత్రి దాటిందేమో! అప్పుడప్పుడు నక్కల అరుపులు ముగ్గురం ఉన్నా భయమనిపిస్తున్నది. నాది కొత్తసైకిలు. చలం కాస్త కండపుష్టికలవాడు కాబట్టి వెనక కారియర్ మీద కూర్చొని తొక్కుతున్నాడు. నేను సీటుమీద కూర్చొని హేండిల్ బాలెన్స్ నిలుపుతున్నాను.

మార్గశిర మాసపు అర్ధరాత్రి చలిగాలిలో కూడా చెమట పడుతున్నది. కొంత శారీరక శ్రమవలనా, మరికొంత లోపల భయంవలనా.

'కనీసం కిన్నెరసాని వాగువంతెనయినా దాటామా?' అడిగాడు రమణ మా పక్క సైకిలు తొక్కుకుంటూ.

'లేదుభాయీ, ఇంకా మూడుమైళ్ళుంది.' అన్నాడు చలం. ఉస్సురని నిట్టూర్చాం-కళ్ళు నిద్రభారంతో మూతలు పడుతున్నాయి.

అయ్యరు హోటల్లో రాత్రి తొమ్మిది గంటలకు తిన్న సాంబారు మెతుకు లెప్పుడో జీర్ణమైనాయి.

మాచలం-కాస్తనాటకానుభవం ఉన్నవాడు. 'పాతాళభైరవి'లో మాంత్రికుని మాటలను అనుకరిస్తూ వింత ధ్వనులు చేస్తుంటాడు. అదేసమయమన్నట్లు అప్పుడావిద్య ప్రదర్శించటం మొదలుపెట్టాడు, ఆ నిర్మానుష్య ప్రదేశంలో. అడవిరోడ్డున-చలికాలపు అర్ధరాత్రి ప్రయాణం-అరచేతిలో ప్రాణాలను పెట్టుకొనివున్న మాకు ఆ అరుపులకు మరింత భయం-ఏదైనా అడవిదయ్యంపట్టి, నిజంగానే అరుస్తున్నాడా అన్న అనుమానం కలిగాయి.

అయినా, రేపటి తొలిఝామున గోదావరిలో మునకలను తలచుకొంటూ భద్రాచలంవైపు సాగుతున్నాయి మా సైకిళ్ళు. కాలం కలిసివస్తే-ఈ సారితో అందరం హైస్కూలు చదువులను పూర్తిచేస్తాం! మళ్ళీ కాలేజీ జీవితం. ఏడెనిమిదేళ్ళుగా కలిసివుంటున్న మా మిత్రబృందమంతా చెల్లాచెదురవుతుంది.

అసలు సందర్భం ఇదీ - ఆరాత్రి తొమ్మిదిగంటల వేళకు అయ్యరు

హోటల్లో భోజనం చేస్తున్నాం నేనూ, చలం, రమణ. మరునాడు ముక్కోటి ఏకాదశి. మాకు ఇరవై మైళ్ళదూరంలోనేవుంది ప్రసిద్ధ పుణ్యక్షేత్రం భద్రాచలం.

నేనే అన్నాను 'వచ్చే సంవత్సరం మన ముగ్గురం ఏ దూర పట్టణానికో కాలేజీ చదువులకు పోతాం, ఐదారేళ్ళుగా ఇక్కడ చదువులు వెలగబెడుతున్నా సరదాగానైనా వెళ్ళి భద్రాద్రిలోనైనా దర్శనం చేసుకోలేదుకదా!' అని.

'పైగా రేపు వైకుంఠ ఏకాదశికూడా' చలం గుర్తుకు తెచ్చాడు.

'అపురూపమైన అవకాశాన్ని జారవిడుచుకున్నాం, ఈ రాత్రి భద్రాద్రి వెళ్ళే ఆఖరి బస్సుకూడా మనకు అందదు' అని మరింత నిస్పృహచెందాడు రమణ.

హోటల్లో ఎక్కువ జనం లేరు. మా మాటలను మాకు వడ్డిస్తూనే శ్రద్ధగా విన్నాడు అయ్యరుగారు.

ఆయన భోజనహోటలు దాదాపు ఇరవై సంవత్సరాలబట్టి అక్కడే నడుపుతున్నాడు. ఈ మాత్రమైనా బస్సూ, ప్రయాణ సౌకర్యాలూలేక రామ భజనలు చేసుకుంటూ, సుదూరప్రాంతాలనుండి కాలి నడకనవచ్చే అనేకమంది యాత్రీకులకు ఈ అయ్యరుహోటలు తప్పనిసరి మజిలీ అయేది, ఎక్కువ భోజనసౌకర్యాలులేని ఆ కాలంలో.

అనేకమంది యాత్రీకుల మనస్తత్వాలను అలవోకగా పరిశీలించే అవకాశమున్న వ్యక్తి ఆ అయ్యరు. అప్పుడు ముఖ్యంగా భోజనం చేస్తూ పర్వ దినాలలో ముచ్చటించుకొనే ప్రధానాంశం భద్రాద్రి ప్రయాణం. దట్టమైన అడవులవెంట, బండ్లబాటలలో కాలినడకన పయనిస్తూ, వన్యమృగాల, దొంగల భయంతో, ఆ పరిసరాలతో పరిచయంలేని బహుదూరపు బాటసారుల ఆందోళనలు-ఆలోచనలు వినటం పరిపాటే ఆ అయ్యరుకు.

మా మాటలువిని నవ్వాడు. ముడతలుపడ్డ నుదురు, బోసినోరు, అనుభవాలు పండిన చూపు. మా ముగ్గురికీ కొంత హేళన కనిపించింది ఆ నవ్వులో. మేము చాలా చిన్నవాళ్ళం కావటంతో సహజంగా ఆయన చాలా చనువు తీసికొని మాట్లాడే వాడు, మావ్యక్తిగత విషయాల్లోకూడా!

'ఏం బాబులూ! ఉరకలువేసే కోడెకారు వయసులో ఉన్నారు. ఇరవై మైళ్ళ దూరంలోఉన్న క్షేత్రాన్ని దర్శించి రావటానికిన్ని ఆలోచనలా? కాలం గడుస్తున్నకొద్దీ బలహీనమౌతున్న మీ తరాన్ని చూస్తుంటే జాలిపడాలో, విచా

రించాలో తెలియడంలేదు' అని ఏక బిగిని అంతవరకూ ఆపుకొన్న తన ఆలో చనల్ని తడుముకోకుండా అన్నాడు.

దాంతో మాకు కొంచెం పౌరుషం వచ్చింది! 'సరేలెండి, రేపు ఫస్టు బస్సుకే బయలుదేరిపోతాం' అన్నాడు చలం.

'బాగుంది! కనీసం ముక్కోటినాడయినా తెల్లవారకుండా గోదావరిలో మునిగే ప్రయత్నం చేయకుండా కాఫీ, ఫలహారాలు సేవించి ఆ దేవుణ్ణి చూసే కంటే, చేతకాదని ఇక్కడినుంచే ఒకదణ్ణం పారేస్తే పోలా?' మళ్ళీ రెచ్చ గొట్టేడు ఆ అయ్యరు.

'అదిసరేనండి, ఈ రాత్రికి కనీసం గోదావరి ఇవతల ఒడ్డైనా చేరే అవకాశం ఏముంది?' దారి చూపించే బాధ్యత ఆయనమీదే నెట్టి సంతోషించేను.

కాని అంతటితో వదిలిపెట్టలేదు ఆ మహానుభావుడు. 'మనసుంటే మార్గం అదేవుంటుంది. భగవంతుడిచ్చిన కాళ్ళున్నాయి, కాదంటే త్వరలో చేరటానికి మీ సైకిళ్లున్నాయి. ఇంకా ఆలోచనలు, తర్జన భర్జన లెందుకు? చేతకావటంలేదని ఒప్పుకోవటం మంచిది. లేనిపోనిసాకులు చెప్పేకంటే' దాదాపు ఒకఛాలెంజిలా తేల్గ్గా విసిరాడు అయ్యరు.

మేం ముగ్గురం ఒకరి ముఖాలొకరం చూసుకొన్నాం. ఎందుకొచ్చిందో ఏమిటో మనం ఈ ఛాలెంజిని ఎదుర్కొందాం! అనే భావాన్ని మా చూపులు ఒకటికొకటి అందించుకున్నాయి. 'ఏది ఏమైనాసరే! మహాశయా! మేమీ రాత్రి బయల్దేరి గోదావరిలో మునిగి, కోవెలలో కొట్టినకొబ్బరికాయ ప్రసా దాన్ని రేపురాత్రికి మీకందిస్తాం! సరేనా?' తుదినిర్ణయం నేనే చేస్తూ, సంభా షణవరకే పరిమితమైన సమస్యను కార్యరూపంలోకి దింపాను. ఆమోదిం చారు మా మిత్రద్వయం వెంటనే.

ఆ నిర్ణయ పర్యవసానమే మా యీ అర్ధరాత్రి ప్రయాణం.

అసలు కథలోకి వద్దాం!

ఎలాగో బ్రతిమాలి, మా చలం అనుకరణ విద్యాప్రదర్శనను విరమింప జేశాం! నక్షత్రాల గుడ్డివెలుగులో మసకగా కనిపించే కంకరరోడ్డుపై గతుకుల కుదుపులతో సాగుతోంది మా ప్రయాణం. కిన్నెరసానిదరికి వచ్చాం. ఒడ్డునే గానుగచెట్ల నీడలు భయంకరంగా పరచుకొని ఉన్నాయి. ఆ యేటి నీటిలో మిలమిల మెరిసే నక్షత్రాల ప్రతిబింబాలు ఆశాదీపాల్లా ధైర్యాన్నిస్తున్నాయి.

"సాగింది, సాగింది
జాలుగాపారింది
ఆవు పొదుగునపాలు ధారగట్టినయట్లు
వనదేవతలువచ్చి నీళ్ల పొలకబోసినయట్లు
తల్లి చల్లని ప్రేమ వెల్లివారినయట్లు"— దర్శించిన విశ్వనాథ వారి కల్పనలో అవతరించిన కిన్నెరసానిని దాటిపోయాం!

ఎగుడు వచ్చినప్పుడల్లా ఆయాసపడుతూ, దిగుడులో జోరుగా చల్లటి గాలికి పరవశించిపోతూ చేరాం! గోదావరి ఇవతలి ఒడ్డుకు. అప్పుడే తొలికోడి కూత వినిపించింది పక్కఉన్న పల్లెనుండి.

అక్కడొక చిన్న గుడిసెలో చమురుదీపాల వెల్తురులో టీ తయారు చేస్తున్నాడొక గ్రామీణుడు. సైకిళ్ళనతనికి ఒప్పగించాం.

తూరుపు దిక్కున తొలి వెలుగురేఖల రాకను సూచిస్తూ పక్షుల కిలకిలా రావాలు మొదలయ్యాయి. మసక వెల్తురు ముసిముసిగా నవ్వుకుంటూ చీకటిని పారద్రోలుతున్న సమయంలోనే బయలుదేరాం కాలినడకన. ఆవలి ఒడ్డున దేవాలయ శిఖరాలు మంచుతెరలచాటున అస్పష్టంగా కనిపిస్తున్నాయి.

గోదావరి నీరు శరత్కాలపు వెన్నెలలా స్వచ్ఛంగా ప్రవహిస్తోంది. ఇసుకతిన్నెలుదాటి, నీటిఅంచుకు చేరాం. అక్కడనుండి పడవలో ఊగుతూ సోలుతూ అవతలితీరం చేరుకున్నాం! అప్పటికి క్రితంరాత్రే క్షేత్రాన్ని చేరుకున్న యాత్రికులందరూ గోదావరిలో మునుగుతున్నారు. శ్రోత్రియులు సంకల్పం చెప్పుకుంటూ అర్ఘ్యం సమర్పిస్తున్నారు. ఆ చల్లటినీటిలో ఊపిరి బిగబట్టి మునకలువేశాం! బట్టలు మార్చుకొని, ఆ జనసందోహంలో పడి, ఏలాగో గుడిమెట్లనుచేరాము. అక్కడ పూలు, కొబ్బరికాయలు తదితర పూజా ద్రవ్యాలను తీసికొని తారకనామం ప్రతిధ్వనిస్తున్న ఆలయ ప్రాంగణంలో అడుగుపెట్టాము.

ప్రతి తల్లీ నిత్యం తన సంతానానికి కోరుకొనే 'శ్రీరామరక్ష'ను ప్రసాదిస్తూ సీతమ్మతల్లితో, లక్ష్మణసమేతుడై కొలువుతీర్చిన భద్రాద్రివాసుడ్ని తనివితీరా దర్శించి, తిరుగుముఖం పట్టాము. ప్రయాణం అర్ధరాత్రి మొదలైతే తిరుగుప్రయాణం మిట్టమధ్యాహ్నప్రవేళ సాగింది. అక్కడ హోటల్లో దొరికిన తినుబండారాలతో ఆత్మారాముణ్ణి సంతృప్తిపరచి, ఇవతలి ఒడ్డుకుచేరి మళ్ళీ ద్విచక్ర వాహనాలను అధిరోహించాం. రాత్రి నిద్రలేమితో, సరైన తిండి

దొరక్కా, ఒళ్ళు సోలిపోతున్నది. కళ్లు వాలిపోతున్నాయి. ఒకటీ రెండూకాదు. ఇరవై మైళ్ళదూరం! అయినా తప్పనిసరి. జొన్నచేలు, కందిచేలు, మధ్యగా కంకర రోడ్డు. రాత్రి కనిపించని పరిసరాలు పగలు కనిపిస్తున్నా చూచేస్థితిలో లేము.

ఆ పరిస్థితిని చదువరులకు తెలియజేయాలని ఉన్నా, అదేమిటో మాట లలో ఇమడని అనిర్వచనీయమైన అనుభవం.

ఎలాగో సాయంత్రం ఐదుగంటలయేసరికి మా గమ్యాన్ని చేరుకున్నాక! సైకిళ్ళకు స్టాండువేసే ఓపికకూడా లేక మా అయ్యరు హోటలు గోడలకే ఆన్చి, వదిలేశాం.

పుణ్యమొస్తుందో రాదో దేవుడెరుగుకాని, అన్నమాట నెగ్గించుకొని, అయ్యరు సవాలునెదుర్కో గల్గామని తృప్తి మిగిలింది. మా రాకను గుర్తించా డేమో సాయంత్రపు భోజనానికి అరగంట ముందుగానే పిలుపు వచ్చింది. మేము వెళ్ళివచ్చిన సంగతి చెప్పకుండానే మా ముఖాలు చెప్పాయేమో 'ప్రసాదం ఏదీ?' అడిగాడు. దారిలో తినగా, పంతానికి మిగిల్చిన చిన్న కొబ్బరి ముక్కను అందించాం. భక్తితో కళ్ళకద్దుకున్నాడు. మావైపు మెచ్చుకోలుగా చూశాడు. మా శ్రమ అంతా మాయమైంది.

అపురూపమైన అనుభవాలనూ అవకాశాలనూ శారీరక శ్రమకు భయపడీ, సోమరితనంతోనూ జారవిడుచుకొనటం పరిపాటి అయిన యీ తరంలో మేము పట్టుదలగా సాధించిన ఈ చిన్న అనుభవం తాత్కాలికంగా కష్టమనిపించినా, మా జీవిత వివిధ దశలలో మదిలో మెదులుతూ సంతృప్తి నందిస్తున్నది నేటికీ.

మరిచాను – ఆ సంవత్సరం అందరం మంచిమార్కులతో పాసయ్యాం!



# అపజయం తప్పదు

వి. వి. ఎస్. భానుశ్రీ

''చూడు రామయ్యా, రేపొద్దున్న పది గంటల తరువాత మంచి సమయ మయ్యా, మళ్ళీ సాయంత్రం ఆరుగంటల తరువాత వర్జ్యం వచ్చేస్తుంది. ఆలోపలే నీకూతుర్ని అత్తవారింటికి దిగబెట్టేశావంటే అది ఆ సీతమ్మతల్లంత అదృష్టవంతురాలవుతుంది. ఆ శుభఘడియలు అలాంటివి.'' అన్నాడు సిద్ధయ్య శాస్త్రి కొంతసేపు అటూఇటూ పంచాంగం పుస్తకం తిరగేసి ముక్కుపొడుం పీలుస్తూ.

రామయ్య అతనికి ఒంగి దణ్ణంపెడుతూ 'ఏదోబాబూ మీదయ. దానత్త కసలు ముందునుంచీ ఇట్టంలేదు బాబయ్యా, ఏవోలేనిపోనివన్నీ చెప్పి, కొడుకు మనసిరిసేసి, అన్యాయంగా దాన్ని కొట్టించి, ఇంట్లోంచి తరిమేసింది బాబూ, పాతిసయాలన్నీ తల్చుకుని నాబిడ్డ కుమిలిపోతుంది బాబూ' అతనిగొంతు గద్గద మయింది. అతనివెనక నుంచున్న వెంకమ్మకూడా కళ్ళొత్తుకోసాగింది.

శాస్త్రికి ఏదోతెలియని జాలి, బాధ, భయం కలిగాయి. 'చూడు వెంకమ్మా, ఇంక నీకూతురికేం భయంలేదు. దానత్త ప్రస్తుతం చావుబతుకుల్లో ఉందికదా! ఇంకరెండు మూడు రోజుల్లో అటోఇటో తేలిపోతోంది. ఇంక నీకూతురేబాధ, పోరులేక పిల్లా పాపలతో దీర్ఘసుమంగళిగా నూరేళ్ళు బ్రతుకు తుంది.' అన్నాడు.

'యెళ్ళొత్తాం బాబయ్యా', అన్నారిద్దరూ సంతోషంగా ఒంగి అతని పాదాల నంటుకుని.

'మంచిది' అన్నాడుశాస్త్రి. వెనక్కితిరిగి లోపలికి వెళ్ళబోయేంతలో-

'నమస్కారం, శాస్త్రులుబాబూ' అన్నమాటవిని బయటకు చూశాడు.

'ఎవరూ, ధర్మయ్యా! రా, రా, ఏమిటి చాలా కాలానికొచ్చావు?' అన్నాడు శాస్త్రి ప్రక్కనేఉన్న స్టూల్‌ను ముందుకు లాగుతూ దానిమీదున్న పుస్తకాన్నితీసి చేత్తోపట్టుకుని.

'ఏంలేదు మాయిల్లు కట్టడం పూర్తికావొచ్చింది. ఈనెల్లోనే గృహ ప్రవేశం చేసేయాలనిఉంది. కాస్తముహూర్తంచూసి చెప్తే' అన్నాడు పక్కనే ఉన్న విసనకర్రతో విసురుకుంటూ.

ధర్మయ్యకు ముప్పైఏళ్ళుంటాయి. ఆఊరి పూర్వపు కరణం కొడుకు. అతని తండ్రీ, సిద్ధయ్యశాస్త్రి తండ్రీ మంచిస్నేహితులు. పేరయ్యశాస్త్రి మంచి పండితుడు. ఊళ్ళోఅందరికీ తల్లోనాలుకగా ఉంటూ భార్యా కొడుకుతో చీకూ చింతాలేకుండా జీవించేవాడు. అతడులేనిదే ఏ శుభకార్యం జరిగేదికాదు. సిద్ధయ్య చిన్నప్పటినుండి పెంకితనం, టక్కరితనం, మోసంవంటి సుగుణాలతో పెరిగి, మాటిమాటికీ బడెగ్గొడుతూ, ఏమీచదవక పండితపుత్రః అనిపించు కున్నాడు. తండ్రిచదివిన పుస్తకాలలో ఏఒకటో రెండోతప్ప ఏమీ చదవకపోగా, ఆయన చనిపోయాక విలువయిన ఆ గ్రంథాలను, కావ్యాలను, ఆయన స్వయంగా రాసిన కొన్ని పుస్తకాలను పట్నం తీసికెళ్ళి, ఎంతొస్తే అంతధరకి అమ్మేసి, గంటలపంచాంగం, ఇంకా ఏవేవో కొన్ని చిన్న చిన్న పుస్తకాలను మాత్రం ఉంచుకుని, తన చమత్కారమైన మాటలతో తగినమర్యాదలతో అందర్నీ ఆకట్టు కుంటూ మెల్లిగా తండ్రి స్థానాన్నాక్రమించాడు. తండ్రినిమించిన కొడుకని పించుకోవాలనేమో అదనంగా, ఏదో నాటువైద్యంచేస్తూ, నోటికొచ్చినజాతకం కూడా చెప్పుకొస్తున్నాడు.

సిద్ధయ్య చేతిలోని పంచాంగంలోని పేజీలను అటూఇటూ తిప్పి, చేత్తో ఏవేవో గుణించి–'చూడు ధర్మయ్యా, వచ్చే శుక్రవారం, పంచమి, అశ్విని నక్షత్రం–చాలా మంచిరోజు, ఆరోజుగాని నువ్వు గృహప్రవేశం చేశావంటే–ఆ యింటితోపాటు మీరుకూడా పుత్రపౌత్రాది సకల సంపదలతో వెయ్యేళ్ళు వర్ధిల్లుతారు. ఆయింట్లో అడుగుపెట్టిన శుభ ముహూర్తాన మీకు లక్ష్మీదేవిలాంటి కూతురుపుట్టే సూచనలున్నాయి' అన్నాడు నలుగురు కొడుకులున్నా కూతురు కోసం తపించి పోతున్న ధర్మయ్యతో.

'నిజంగానా బాబూ!–అంతకన్న నాక్కావలసిందేముంది' సంతోషంతో అని, ఒక్క క్షణమాగి–'కానీ, బాబూ నాలుగేళ్ళకిందట ఆరోజునే అనుకుంటా మన కోటయ్య తనపాకలో గృహప్రవేశం చేశాడు. కాని–కాని ఏంజరిగింది బాబూ, సంవత్సరం తిరక్కుండానే అతని ఏడేళ్ళకొడుకు పాముకరచి చని పోవడం, మొత్తంమీద అతనిపాకే అగ్నికి ఆహుతి అయిపోయింది. అది మంచిది కాదేమో బాబూ సరిగ్గా చూసి చెప్పండి.' అన్నాడు ధర్మయ్య.

గతుక్కుమన్నాడు సిద్ధయ్య. 'వీడిదుంపతెగా, వీడికెక్కడ జ్ఞాపక మున్నాయీ ఘడియలు! నాకసలా సంఘటనే జ్ఞాపకం లేదు. అపును అలా అవగానే ఈ మూఢ ప్రజలందరూ ఆ ముహూర్తం గురించి ఆరా తీశారు' అను

కుని మళ్ళా వెంటనే సర్దుకుని-'ఆఁ అలా అడుగు చెప్తాను. అసలు నేను చెప్పిందంతా కరక్టేనయ్యా, ఆ రోజు వాడికేదో తీరలేదని మళ్ళీ నన్నడక్కుండానే మరోరోజున గృహప్రవేశం చేసేశాడు. నిజానికారోజు ఎలాంటి దుర్ఘడియలున్నాయంటే-రామ-రామ' అన్నాడు బాధ నటిస్తూ శాస్త్రి.

'మరావిషయం ముందే చెప్పకపోయారా?' అన్నాడు ధర్మయ్య.

'అయ్యో ఆ కోటయ్య ముహూర్తం మార్చాలన్న విషయం నాకు చెప్తేనా! ఒకసారి-నాతో ఒక్కసారి ఆవిషయం చెవిన వేశాడంటే అంత ఘోరం జరగకపోనుకదా! అసలు విషయం తెలియక అప్పుడు చాలామంది నామీద పడ్డారు. సరేలే-పాతవిషయాలెందుకు? ఇప్పుడు నీకు నేను చెప్పిన ముహూర్తం చాలామంచిది-పోనీ నీకంత సంతృప్తిగా లేకపోతే మరోటి మారుస్తాను' అన్నాడు.

ధర్మయ్య చిన్నగా నిట్టూర్చి 'సర్లెండి. ముహూర్తం ఏదయినా మనకు మంచిజరగడంకదా కావాలి. ఏదో మేమంతా చదువురానివాళ్ళం గాబట్టి అన్ని 'విద్యలూ' తెలిసిన నీలాంటివాడిమీద ఆధారపడి నువ్వు చెప్పినట్లు నడుచుకుంటున్నాం. ఏమయినా జరిగిందంటే- మాకర్మ - అంతే!' అని లేచి-'వస్తాను బాబూ!' అని రెండుచేతులూ జోడించి బయటపడ్డాడు.

శాస్త్రి తన భుజంమీద కండువా తీసి-మొహంమీద చెమట తుడుచుకుని-గట్టిగా రెండుసార్లు దులిపి-'పొగరుబోతు వెధవా! పొట్టచీలిస్తే అక్షరంముక్కలేని వెధవలుకూడ నన్ను విమర్శించడానికి తయారవుతున్నారా? నా మాటమీద అంత నమ్మకంలేని వెధవలు-మంచిరోజు చూడండంటూ రావడమెందుకూ?!' అని కోపంగా ఒక అరగంటసేపు గొణుక్కుంటూండగా వీధిగేటు తెరుచుకుని-నలభై య్యేళ్ళ వ్యక్తి ఇంట్లోకడుగుపెట్టాడు.

సిద్ధయ్య తలెత్తి చూసి అంతవరకు చిటపటలాడుతున్న తన మొహాన్ని ప్రసన్నంగా మార్చుకుని-'ఓహో! నారాయణమూర్తిగారా! దయచేయండి-దయచేయండి! ఏమిటింత ఎండలో బయల్దేరేరు? కబురంపితే నేనే వచ్చేవాణ్ణిగా!' అని 'అమ్మాయ్ సీతా! ఓ గ్లాసుతో మజ్జిగ పట్రామ్మా!' అని కేకేశాడు కూతుర్ని.

'అబ్బా, ఇప్పుడవన్నీ ఎందుకండీ. ఏదో కొంచెం పనుండివచ్చాను.'

'ఆ విషయం ప్రత్యేకంగా చెప్పాలా. పని లేకపోతే మీలాంటివారు మాయింటికి వస్తారా? అని సిద్ధయ్య ఏదో పెద్ద జోక్ చేసినట్టు నవ్వేశాడు,

నారాయణమూర్తి ఆ వూరి కరణం. మనిషికి చదువు సంధ్యల్లేకపోయినా తనివితీరని 'ధనదాహం' దాదాపు ఏభై ఎకరాల పొలం, పెంకుటిల్లు, మామిడితోటలు ఉన్నాయి. ఆ గ్రామంలో ఎవ్వరికీ యివ్వని గౌరవం, విలువ సిద్ధయ్యకిస్తాడతను. దానికి కారణం అతనికి గల మూఢనమ్మకాలే! ఏ పని చేయాల్సొచ్చినా, ఆఖరికి ఇంట్లో పిల్లి తుమ్మినా, ఈగదగ్గినా, ఏచిన్న శుభకార్యం చేయాల్సొచ్చినా అంతా శాస్త్రి సలహామీద జరుగవలసిందే! ఒక విధంగా ఆ గ్రామ ప్రజలకు నారాయణమూర్తి రాజయితే, సిద్ధయ్యశాస్త్రి మంత్రన్నమాట! ఏ పని చేసినా తన సలహాలేనిదే చేయడని గ్రహించిన సిద్ధయ్య తన నోటి నుండి వచ్చే ప్రతి మాటకీ పదేసిరూపాయల్చొప్పున లాగుతుంటాడు. ఇంక నారాయణమూర్తి తనంతట తనే యిచ్చే ధనవస్తువులకు లెక్కలేదు. అందుకే శాస్త్రికి అతనంటే కాస్తభయం భక్తీ ఉన్నాయి.

బయట ఎండ నిప్పులు చెరుగుతూంది. వేడిగాలి రివ్వున లోపలకు వస్తూంది. నారాయణమూర్తి మజ్జిగతాగిన గ్లాసుని కిందపెట్టి పై తుండుగుడ్డతో మెడ, మొహం తుడుచుకుని విసనకర్రతో విసురుకుంటూ అన్నాడు. 'మా రెండోపిల్ల కమలలేదూ, దానికి పెళ్ళిడొచ్చేసిందో! అని వాళ్ళమ్మగోల, సంబంధాలు చూస్తునేఉన్నాంగామరీ! మొన్ననే ఆ రామాపురంలో ఏదో సంబంధం ఉన్నట్లు తెలిసింది. చూసిరావడానికి రేపే వెళదామనుకుంటున్నాను. వర్జ్యం అదీ లేకుండాచూసి-మంచి ముహూర్తం చెప్పు-'

'అయితే మరీ....ఆ మునసబుగారి కొడుకు....'

'ఆ(—ఆ మున్సబుకొడుక్కి—, నాకూ ఏముందయ్యా, పట్టుమని పదెకరాలు కూడా లేవు. నిజంగా ఇప్పుడు చూసిన సంబంధం ఆహా! అతను నిజంగా జమీందారే అనుకో! మనపిల్ల సుఖపడాలీ అంటే అలాంటివారికివ్వాలి. పది తరాలు కాలుమీద కాలేసుకున్నా తరగని ఆస్థి....'

'మున్సబుగారి కొడుకూ, మన కమలమ్మ పాపం నచ్చుకున్నారు కదండీ! ప్చ్, ఆ(— అయినా వాళ్ళు నచ్చుకునేదేమిటిలెండి. వాళ్ళబాగోగులు చూడ్డానికి మనవు(న్నాంగా! ఇంతకీ ఆ అబ్బాయికెంత వయసుంటుందంటారు?' అన్నాడు సమర్థించేస్తూ, కాదంటే తనక్కావలసినవేవో దక్కవని.

నారాయణ కొంచెం ఆలోచించి 'మహా అయితే-ఓ నలభై ఉండొచ్చు' అన్నాడు.

'నలభై ఉంటాయా!-ఆ( అయినా ఫరవాలేదులెండి కమలకి పదిహే

సుంటాయికదూ. అతనికి రెండోపెళ్ళా-పిల్లలా!' అన్నాడు మళ్ళీ సమర్థిస్తూ సిద్ధయ్య.

'అవును.. నలుగురు పిల్లలు పెద్దకూతురు కమల ఈడుదే!' అన్నాడు తేలిగ్గా.

శాస్త్రి కొంతసేపు ఆలోచించాడు. అంటే అల్లుడివయసూ మామగారి వయసూ సమానమేనన్నమాట! ఆ మునసబు మంచివాడయితే ఎవడిక్కావాలి? నారాయణమాత్రం! తన కూతుర్నెవరికిచ్చుకుంటే నాకెందుకూ? తనక్కావల సింది డబ్బు! రెండువైపులనించీ మొత్తంమీద రెండు మూడు వేలదాకా లాగొచ్చు! తనకీ పెళ్ళీడొచ్చిన కూతురుంది. మొన్నెప్పుడో నాలుగెకరాలు అమ్మకానికొచ్చాయని విన్నాడు. పెరట్లో భూమిని చదునుచేయించి రెండు గదురు వేయించాలి.

'ఇంతకీ ఏమంటావు సిద్ధయ్యా, రేపు మంచిదేనంటావా?'

రేపు మంచిదో కాదో ఎవడికితెలుసూ. మనిషి పుట్టిననాడు మంచిరోజు, చచ్చిననాడు చెడ్డరోజు! ఇంకీమధ్యలో మనిషిచేసే ప్రతిపనికీ మంచిరోజు అంటూ చూసుకోవడమెందుకూ?

శాస్త్రి కొంతసేపు పంచాంగం అటూఇటూ తిరగేసి 'రేపు మంచిది కాదండీ! ప్రయాణాలకు ఎల్లుండి మంచి ముహూర్తం ఉంది. అప్పుడు వెళ్ళండి మీరు! ఆ సంబంధం తప్పకుండా కుదరాలని భగవంతుణ్ణి ప్రార్థిద్దాం' అన్నాడు శాస్త్రి.

'సరే. అయితే నే వెళ్ళొస్తాను' అన్నాడు లేచినిలబడి.

'మంచిది'. అని 'ఆఁ చూడండిబాబూ మొన్న ఈ వూరికి కరెంటుతెప్పిస్తామని, రోడ్డువేయిస్తామని ప్రజలదగ్గర వసూలుచేసిన సొమ్ములో....నావాటా' అన్నాడు నానుస్తూ.

'నీకెందుకయ్యా వాటా!' అన్నాడు నారాయణ మధ్యలో నువ్వొకడవా అన్నట్టు.

'అదేవిటండీ అలాగంటారూ! మరినేను మరోసంవత్సరం దాకా మంచి ముహూర్తాలులేవనీ, ఈలోగా చేసినా ఆపనన్నీ విఫలమయి పోతాయని మీరు చెప్పినట్టుగా దొంగ జాతకం చెప్పలేదూ! అందుకే నావాటా ఇప్పుడే ఇప్పిస్తే' అన్నాడు ముందరకాళ్ళకు బంధంవేస్తూ.

'ఇదెక్కడి తద్దినంరా బాబూ' అనుకొని 'సరే ముందిదికానీ తరవాత చూస్తానులే' అన్నాడు.

నారాయణ గేటుదాకావెళ్ళి మళ్ళీ తిరిగొచ్చి 'ఆఁ చూడుశాస్త్రీ, వీలయితే నువ్వూ రాకూడదూ ! ఇద్దరంవెళ్తే కాస్త అండగాకూడ ఉంటుంది ఒకరికొకరు' అన్నాడు.

'నేనా ! సరే ఆలోచించి సాయంత్రం చెప్తాను' అన్నాడు. ఆలోచించ వలసిన అవసరం లేకపోయినా.

'సరే వెళ్ళొస్తాను'.

శాస్త్రి లోపలకురాగానే అతనిభార్య చెప్పింది. 'ఏమండీ వీరయ్యపెళ్ళాం మనవడికి కడుపునొప్పిగా ఉందనివస్తే మీరు మాట్లాడుతున్నారని నేనే ఆ యెర్రసీసాలో మందుకాస్త పోసిచ్చాను' అంది.

'పోస్లే మంచిపనేచేశావు' అన్నాడు శాస్త్రి. నిజానికదేమందో తనకీ తెలియదు. ఎప్పుడో సంవత్సరం క్రిందట తను పట్నంవెళ్ళినప్పుడు డాక్టరు ఏవో రెండుమూడు రకాల మాత్రలిస్తే అవి ఇంటికితెచ్చి రెండుమూడు రకాల మందులు తయారుచేసి అవే అందరికీ ఇస్తున్నాడు.

ఎంత అన్యాయం ! సిద్దయ్యలాంటి మోసగాళ్ళున్నా, ఆ పల్లెప్రజల్లాంటి అమాయకులింకా ఉన్నారా ఈ కలియుగంలో ! పల్లెటూళ్ళ ప్రజలందరూ రాజకీయాల్లోనూ, పార్టీల్లోనూ, మోసంలోనూ, దగాల్లోనూ, పట్నంప్రజలను మించిపోయారే ! మూఢ విశ్వాసాలను, పాతఆచారాలను వారుకూడా సాధ్యమయినంత వరకు తొలగించి నవ్యతలోనికి అడుగుపెడ్తున్నారే ! అయినా ఇంకా ఇలాంటి మూర్ఖులు ఉన్నారా ! రైలుదిగి, రెండుబస్సులు మారి, ఎద్దులబండిలో ప్రయాణం చేసి, అక్కడినుంచి రెండుమూడు మైళ్ళునడిస్తే కనిపించే ఎటువంటి వైద్యసదుపాయాలు కాని, ప్రయాణ సౌకర్యాలుకాని, కనీస సదుపాయాలులేని ఒక మారుమూల పల్లెటూళ్ళో ఈనాటి నాగరికత, సభ్యత, సంస్కారం ఇంకా అంటలేదంటే ఆశ్చర్యమేముంది? ఏదో ఒక మిషమీద అప్పుడప్పుడైనా కాస్త పట్నం వాసనలు చవిచూసే నారాయణా, సిద్ధయ్యలాంటి వాళ్లు తమగడుసుతనాన్ని అభివృద్ధి చేసుకుని ఆ అమాయకులను తమ గుప్పిట్లో ఉంచుకుని మోసగిస్తున్నారు. పల్లెప్రజలకు పట్నంఅంటే ఒక దేవలోకం; అటువంటి పట్నాన్ని చూసివచ్చిన వారు పదిచెబితే అది వేదవాక్యం ! లోకంలో యింకాఇటువంటి వారున్నారా అంటేనే ఆశ్చర్యమేస్తూంది.

ఏ జబ్బుకేదిస్తారో తెలియని మందులు, నిజమోకాదో తనకేతెలియని ముహూర్తాలు, నోటికేదొస్తే అది జాతకాలుగా చెప్పే సిద్దయ్యలాంటి

మూర్ఖుల్ని, అతిసులభంగా మోసగించే దుర్మార్గుల్ని భగవంతుడుతప్ప ఎవరు శిక్షిస్తారు ?

ఆ భగవంతుడు సృష్టించిన మానవుల్లోనే ఎంతభేదం ? ఒకడు తన విజ్ఞానంతో మరోగ్రహానికివెళ్తే, మరొకడు తన మూఢనమ్మకంతో ఇంకా చంద్రుణ్ణో దేవుడిగా పూజిస్తున్నాడు. ఒకడు సకలసంపదలతో కాలు కింద పెట్టకుండా తిరుగుతూ ఎయిర్ కండిషన్డ్ రూమ్‌లో పడుకుంటే మరొకడు పూటకు గతిలేక అన్నిరకాల బాధలకు ఓరుస్తూ పేవ్ మెంట్ మీద పడుకుంటు న్నాడు. ఒకడికి కేవలం ధనమే ముఖ్యమయితే మరొకడికి సభ్యతా సంస్కారం ముఖ్యం ! ఎందుకీభేదాలు ? భగవంతుడు ఈ ప్రకృతిని, అందులోకీ సంపదను అందరికీ సమానంగా పంచుకోమని సృష్టించాడు. అయితే ఎవరికందింది వారు దోచుకుంటూన్నారేతప్ప ఆవగింజంత సమానత్వం కూడాలేదు.

సిద్ధయ్యా, నారాయణా ఎక్కినబస్సు ఏటిదగ్గరకొచ్చి ఆగిపోయింది. అందులో వేసవిలో నీళ్లుండవు. కాబట్టి బస్సుకూడా అందులోంచి వెళ్ళిపోతుంది. నీళ్లుంటే పడవమీద వెళ్తుంటారు. లోతుకూడా అట్టేవుండదు. మధ్యకువెళ్ళినా సుమారు ఎత్తుమనిషికి గుండెలవరకు వస్తుంది. నాలుగయిదు రోజులక్రిందట పెద్ద గాలివాన రావడంతో ఏరుబాగా పొంగిపోయి చుట్టుపక్కల పొలాలనీ, ఇళ్ళనీ బాగా ముంచేసింది. ఇప్పుడిప్పుడే కాస్త యధాప్రకారంగా ప్రవహిస్తూంది. కాని ఇంకా ఉధృతం తగ్గలేదు.

'ఏంచేద్దావోయ్ ! పడవలవాళ్ళుకూడా ఎవరూ లేరు. ఈ ప్రవాహంలో ఈదుకుని వెళ్ళలేము. వెనక్కి తిరిగి పోదామా ?' అన్నాడు నారాయణ మేఘాలు కమ్ముకుంటున్న ఆకాశంవంక నిరాశగా చూస్తూ.

'తప్పదంటారా ?' అన్నాడు సిద్ధయ్య మరింత నిరాశగా.

'మరేం చేస్తావయ్యా ? ఇప్పుడీ ఏట్లోకిగాని అడుగుపెట్టామంటే మన పాపాలే మనల్ని ముంచేస్తాయి' అన్నాడు కాస్త భయంగా నారాయణమూర్తి.

కొంచెం ఆలోచించి అన్నాడు సిద్ధయ్య. 'చూడండి నారాయణగారూ, ఈ ముహూర్తం నేనేకదా నిర్ణయించాను. నేను మీకన్యాయం చేస్తానుటండీ ! నామాట వినండి. బంగారంలాంటి ముహూర్తంలో బయల్దేరాము. మధ్యలో ఇటువంటి చిన్నచిన్న అడ్డంకులు వచ్చినా, మనపని నెరవేరుతుంది. నేను తల పెట్టిన పనికింతవరకూ అపజయం కలగలేదు. మీరేం ఆలోచించకండిక. నే నున్నాగా, పదండి' అని తొందరచేస్తూంటే.

'అయినా నాకులేని తొందర నీకెందుకయ్యా?' అన్నాడు నారాయణ కాస్త చిరాగ్గా.

గతుక్కుమన్నాడు శాస్త్రి. నారాయణ కాస్త ఆలోచించి ముందువెనుక లాడతాడేమోనని ఏదోవిధంగా తనైనా ఆ సంబంధాన్ని స్థిరపరచాలని బయల్దేరాడు. ఇది తప్పిపోతే తనకి మూడువేల రూపాయలు-ఒక్కసారిగా ఎలా దొరుకుతాయి? తనకి చాలా తొందరగా ఉంది ఎలాగోలా అవతలి ఒడ్డుకు చేరిపోయామంటే అదృష్టం తనను వరించినట్లే! అదుకే కాస్త విసుగుతో అన్నాడు.

'సరే పదండయితే! మరో ఆర్నెల్లదాకా మంచి ప్రయాణ ముహూర్తాలు లేవు. ఈలోగా ఆ సంబంధంకాస్తా దాటిపోయిందంటే-అంతకంటే మంచి సంబంధం-మీకు దొరకడం-కష్టం! నాకేం బాధలేదు! మీ గురించే చెప్తున్నాను. పదండి వెనక్కి, ఇంకా ఆలోచిస్తారెందుకు?' అన్నాడు రెచ్చగొడుతున్నట్టు.

'సరేలే పదవయ్యా! ఆలోచించేకొద్దీ ఆలస్యమేతప్ప ఇంకేం జరగదు. నీమాటేకానీ! రా దిగుదాం-నాచెయ్యి గట్టిగా పట్టుకో'-అన్నాడు పంచె పైకెగబెట్టి నీళ్ళలో కదుగుబెడుతూ.

అతివేగంగా ప్రవహిస్తున్న ఆ నీటి ప్రవాహాన్ని ఈదుకుంటూ అతికష్టం మీద పదడుగులు వేశారోలేదో టప్‌టప్‌మని చినుకులు పడ్డం మొదలెట్టేయి. ఇద్దరూ గట్టిగా ఒకరినొకరు పట్టుకుని ముందుకు సాగుతున్నారు. 'ఎలాగయ్యా యిప్పుడు? చినుకులుకూడ మొదలయ్యాయి' అన్నాడు నారాయణమూర్తి భయంగా.

ముందుకు వెళ్తున్నకొద్దీ పక్కకు, వెనక్కు తోసేస్తూంది ప్రవాహం. ఒకవిధంగా ప్రవాహంతో యుద్ధం చేస్తున్నారు. భయంతో ఇద్దరూ మరింత గట్టిగా పట్టుకుని-ప్రాణాలతో పోరాడుతున్నారు. ఆ క్షణంలో వారుచేసిన పాపాలు, అన్యాయాలు, మోసాలు-వారిముందు వికృతంగా నిలుచుని వికటాట్టహాసం చేస్తున్నాయ్! ఎంతోమంది అమాయకులను అన్యాయంగా మోసంచేసిన దుర్మార్గులు మానవులకు పట్టుబడకపోయినా-వారిని పట్టుకునేవారే ఉండరా? ఇంతవరకు జీవితంలో ఓటమిని ఎరుగని దుర్మార్గులు ప్రవాహవేగంతో ఓడిపోయి-మృత్యుదేవత ఆసరాతో-తేలిపోయారు.

అన్యాయాలకు-అక్రమాలకు ఎప్పటికైనా అపజయం తప్పదు!



# ముగింపు

## 'నాగరంజని'

'గుడ్ మార్నింగ్ సార్'—'వెరీగుడ్‌మార్నింగ్' 'నమస్కారం డాక్టర్ బాబు'—
'నమస్కారం' ఎలాగుందండి రాత్రి నిద్ర బాగా పట్టిందటగా, 'నమస్తే డాక్టర్ బాబు' 'నమస్తే-నమస్తే'. ఇలాంటి పలకరింపులు రోజూ జరుగుతాయి. వార్డులోని పేషంట్లు-నర్సులు నన్ను చూడగానే చిరునవ్వులు చిందిస్తారు. అందుకు కారణం నా పెదవులపై చెరగని చిరునవ్వే. డాక్టర్‌గా జాయిన్ అయిన కొద్దిరోజుల్లోనే గ్రహించిన నిజాన్ని పెదవులపై నిలిపాను. ఇక్కడి పేషెంట్లంతా తమ ఆత్మీయులకు దూరంగా ఒంటరిగా బంధించబడి ఉంటారు. ఇలా ఒంటరిగా మంచంపై పడుకొని గంటలు, దినాలు గడిపి ఒంటరి తనంతో విసిగిపోతారు. కొందరు దిగులుపడతారు. అలాంటప్పుడు వారికి ఆత్మీయతతో పలకరించేవారు, హాయిగా నవ్వించేవాళ్ళు కావాలి. రోగిని బాగు చేయటానికి కేవలం మందులు, యింజక్షన్లు చాలవని నా అనుభవంలో గ్రహించాను. చేదుమాత్రలకు స్వీట్ కోటింగ్ వేసి మ్రింగించినట్లు-నవ్వి, నవ్వించి వారి బాధలను, రోగాలను మాయం చేయాలని చూస్తాను. డాక్టర్ ఆనంద్, కులకర్ణి, నళిని, రామ్మోహన్‌లను వీళ్ళు పరోక్షంగా విసుక్కోవడం నేను చాలాసార్లు చూసాను. వారంతా గంభీరంగావుండి లేని హుందాను నటిస్తారు. రాని నవ్వును తెచ్చుకొని నటించడం వారికి చేతకాదు. మొదట్లో నాకూ చేతకాలేదు, కాని గట్టిగా ప్రయత్నించా, నటించా. నటించి-నటించి అదే సహజమైంది.

డాక్టర్లంతా వెళ్ళిపోయారు. నా డ్యూటీకూడా అయిపోయింది. బేసిన్‌లో చేతులు కడుక్కొని సిగరేట్ ముట్టించి బయటకు నడిచాను. హాస్పిటల్‌కు ముందరే పోలీస్ స్టేషన్ దానికి కొంతఎడంగా మునిసిపల్‌పార్కు. నడుస్తున్న నాకు హఠాత్తుగా వరుసగా మూడు రోజుల్నుండి చూస్తున్న దృశ్యం జ్ఞాపకానికొచ్చింది. ఒక పిచ్చిది, మునిసిపల్ గార్డెన్ ప్రహరీగోడ ప్రక్కన పడిఉంది. ఎందుకో నా చూపును ఆకర్షించింది. ఈనాడే కాదు ఆ పిచ్చిదాన్ని మూడునాలుగేండనుండి చూస్తున్నాను. సాధారణంగా ఎప్పుడూ ఆ ప్రహరీ

గోడ ప్రక్క కూర్చుని లేదా పడుకొని ఉంటుంది. దాని జీవితం ఆ గోడ ప్రక్కనే గడచిపోతుంది. ప్రతిరోజూ అక్కడికి రాగానే అనుకోకుండా అటు చూపు మరలుతుంది. చాలా చిత్రమైన జీవితం దానిది. మనం అందరం బ్రతుకుతున్నాం ఎంతో ఖర్చుతో-ఏదో తపనతో. కాని దాని బ్రతుకులో ఏ తపనాలేదు. మనం బ్రతకటానికి ఏదో చేస్తాం. అది ఏమీచేయదు. భగవంతుడి సృష్టిని ఎప్పుడూ సూక్ష్మంగా పరికించి చూస్తే చిత్రంగా ఉంటుంది. అది పిచ్చిది. దానికి కోరికల్లేవు సరదాలు లేవు. కాని ఒకటుంది అది ఆకలి. ఆక లేసి దాని యిష్టం వచ్చినప్పుడు ఏ హోటల్ ముందో పోయి కూర్చుంటుంది. హోటల్ వాళ్లు మిగిలినఎంగిళ్ళు విస్తట్లో తెచ్చి దానిముందు పడేస్తారు. తింటుంది, తినగా మిగిల్చింది తీసుకెళ్ళదు. రేపటి చింత దానికి లేదు. మాపటి చింత అసలులేదు. నేను ఎన్నోసార్లు చూసాను. హోటళ్ళముందు విస్తట్లో తింటుండగా. ఆమెతోపాటు కుక్కలూ తింటాయి అదే విస్తట్లో నోరుపెట్టి-కాని వాటిని అది విదిలించదు. ఈ విధంగా చూసినప్పుడల్లా నాకెందుకో మనసులో బాధ కలుగుతుంది. భగవంతుడు ఇలాంటి వాళ్ళను ఎందుకు బ్రతికించాడు. వీళ్ళని చూసి మనని ఏమైనా నేర్చుకోమంటాడా! ఏమో!! రోజు రోజుకీ క్రొత్తగా వస్తున్న రోగాలు-దానికి పోటీగా నడుస్తున్న వైజ్ఞానికశాస్త్రం. మా మేధస్సుతో పోరాడినా మృత్యువాతను ఆపలేక మా కండ్లముందే ఎందరో పోతే చూస్తూంటాం. వారి అవసరం లోకానికి ఎంతో వుంటుంది. దేవుడు వారిని బ్రతికించడు. కాని అవసరం లేని వారికి ఆయువు ఎక్కువిచ్చి బ్రతికిస్తాడు. గత నాలుగేండ్లలో ఈవూర్లో కలరా రెండుసార్లు ఉధృతంగా వచ్చింది. మునిసిపల్ ప్రభుత్వం కలరానివారణకై ఎంతో ప్రయత్నించింది. అయినా ఎందరో మృత్యువాత పడ్డారు.

ఆ పిచ్చిది చావలేదు. ఏ ఆరోగ్యసూత్రం పాటించలేదు. ఈగలు చచ్చిన కుక్క మెతుకులు తింది. మురికికాలువలో నీళ్ళు తాగింది. అయినా చావలేదు. నేటికి మూడు రోజులవుతుంది, అక్కడే గోడప్రక్కన మట్టిలో పడి ఉంది తీవ్రమైన ఎండలో. మెల్లగా మూలుగుతూ నాలుకతో మాటిమాటికి పెదవులు తడుపుకుంటుంది. చూడగానే గ్రహించాను అనారోగ్యంగా ఉందని. నాలుగేండ్లలో ఇది జబ్బుపడటం చూడ్డం యిదే మొదటిసారి. దానికేమయిందో చూడాలనిపించింది. అక్కడే నిలబడి మరో సిగరెట్ ముట్టించి ఆగాను. కాని ఎందుకో వంగి చూడలేకపోయాను. ఆమె అంటే అసహ్యం అనికాదు. ఎవరికి

కాని ఒక పిచ్చిదాన్ని గురించి పట్టించుకుంటే ఈ ట్రాఫిక్ ఆగిపోదు. తోవన పోయే వాళ్ళంతా తనవైపు వింతగా చూడరు. మనుషుల స్వభావమే చిత్రాతి చిత్రం. నవలల్లోని దేవదాసును ఎంతో ప్రేమిస్తాం, కన్నీళ్లు పెడతాం, ప్రేమకు ఆదర్శంగా చూస్తాం. కాని ఎవరయినా జీవితంలో ఓడిపోయి భగ్న ప్రేమికుడైతే నవ్వుతాం. అతన్ని-అతనీ ప్రేమనూ పరిహసిస్తాంగాని అర్థంచేసుకోం. రంగులతో వేసిన ఒక బాధాతప్త హృదయుడైన బిచ్చగాడి బొమ్మను చూసి మైమరచిపోతాం. ఎంతో బాగుందని మెచ్చుకుంటాం. ఒకవేళ ఆ బొమ్మకే ప్రాణంవచ్చి మన జీవితంలో తటస్థపడితే అసహ్యించుకొని ముఖం చాటు చేసుకుంటాం. పూజ్యబాపూజీ సూత్రాలు పఠిస్తాం వేదికలెక్కి ఉపన్యసిస్తాం. మనిషిని-మనిషి ప్రేమించాలి, దేవుడెక్కడోకాదు మనలో-మనిషిలోనే ఉన్నాడని. కాని ఎవరూ పాటించరు.

ముందుకు కదిలాను మౌనంగా. చకచకానడిచి యిల్లుచేరాను.

ఆరోజు నాకు నైట్ డ్యూటీ పడింది. ఎంత మరిచిపోదామన్నా ఆ పిచ్చిది మరుపుకురావడంలేదు. బహుశా మూడు రోజులైంది ఎంగిలిపడి-పైగా అనారోగ్యం. వెంటనే దగ్గర్లోవున్న షాప్‌లోకినడిచి ఒక బ్రెడ్‌పాకెట్-నాలుగు అరటిపళ్ళూ తీసుకొని ముందుకు నడిచాను. అది అలాగే మూలుగుతూంది యింకా ఏంబాధో. కాస్త చీకటిగాఉంది. మెల్లగావంగి నాడి చూస్తుండగా ప్రక్కనేవున్న పోలీస్‌స్టేషన్‌లో నుండి పోలీస్‌వాన్ బయటకొచ్చి రోడ్డెక్కింది. చిటుక్కున చేయివదిలేసి, చేతిలోనిపళ్ళూ, బ్రెడ్ అక్కడ దానిముందర పడేసి విసురుగా ముందుక్కదిలాను.

హాస్పిటల్ చేరాను కాని మనసు స్థిమితంగా లేదు. సీరియస్ కేసులేమీ లేవు. అయినా ఒకసారి వార్డులన్నీ తిరిగొచ్చాను. పేషెంట్సంతా హాయిగా నిద్రపోతున్నారు. మనసు అదోలాగుంది. మళ్ళీ ఒకసారి హాస్పిటల్ బయట కొచ్చి ఆ మునిసిపల్ పార్కువైపే నడిచాను. ఎవరోయిద్దరు ఫ్రెండ్స్‌కాబోలు అక్కడే ఎదురుబదురుగా కలుసుకున్నట్లుంది-నిలబడే బాతాఖానీ వేసారు. పది నిమిషాలు వెయిట్ చేశా, కాని వారు కదల్లేదు. విసుగేసి తిరిగి హాస్పిటల్ చేరాను. ఎంతప్రయత్నించినా నిద్ర రావటంలేదు. అయినా బలవంతంగా కళ్ళు మూసుకొని నిద్రకుపక్రమించా. తెల్లవారుతుండగా చిన్నగా కునుకుపట్టింది. నిద్రలేని కారణంగా కళ్ళు బరువుగా ఉన్నాయి. అలాగే యింటిముఖంపట్టాను ఏడుగంటలకు. పోతూ-పోతూ ఒకసారి అటుచూశాను. పిచ్చిగా మూలగడం

లేదు. నిద్రపోయినట్లుంది. నిన్నరాత్రి అక్కడవదిలిన బ్రెడ్, పళ్ళూ లేవు. తినేసిందేమో! అనుకోకుండానే ఒకనిట్టూర్పు వదిలి ముందుకు నడిచాను.

సాయంత్రం డాక్టర్ మాథూర్ ఇంట్లో పార్టీ. అక్కడినుండి బలవంతంగా మొదటిఆట సినిమాకెళ్ళాము. ఆటనుండి తిరిగి వస్తుండగా ఏమైతే అదయిందని వంగి చేయి పట్టుకొని చూశాను. అంతే, నా ఆశ్చర్యానికి అంతులేదు. ఏమిటిది? నాలుగేండ్లు జరగనిది యీనాడు....ఛీ! భగవంతునిపై అసహ్యం కలిగింది. ఎందుకిలా చేస్తాడు? ఇలాంటివాళ్ళను తీసుకెళ్ళడెందుకు? ఇలాంటివారితో ఆడుకోవడం సరదా! ఎంతటి పాపానికైనా ఇంతటిశిక్ష వద్దు భగవాన్-వద్దు. ఇంటికెళ్ళి బట్టలుమార్చుకొని పడుకున్నా. నిద్రరావడంలేదు. ఆలోచన, ఒకటే ఆలోచన. ఇక పిచ్చిదాని కథ ఎలాముగుస్తుంది. లేదు యిలాంటి నిర్భాగ్యుల కథ అంత తొందరగా ముగించడాదేవుడు. ముగించేవాడయితే ఎప్పుడో ముగించాల్సింది. బహుశా అసలు కథ యిప్పుడే మొదలవుతుందేమో! మొదలిడే కథ ఊహిస్తేనే ఎంతో భయంకరంగా ఉంది. కథ ముందుకుసాగితే ఎలా ఉంటుందో? లేదు వీల్లేదు. ఈ కథ ముందుకు సాగొద్దు. ఈ కుళ్ళు ధరిత్రిలో, ముళ్ళసమాజంలో యిలాంటి కథలు నడవలేవు. ముగింపు యిక్కడేకావాలి, యిక్కడేకావాలి. మనసులో గట్టినిర్ణయం. గబగబా బట్టలేసుకొని తలుపులు తీసుకొని బయటకొచ్చాను. నాలుగడుగులేశాక గుర్తొచ్చింది. వెళ్ళి సిరెంజ్-ఒక బాటిల్ తీసుకొని నడిచాను. నిన్నటికన్నా చీకటిగానే ఉంది. చుట్టూ పరికించాను, ఎవరూలేరు. పిచ్చిదాని ఒళ్ళు జ్వరంతో కాలిపోతోంది. నాడి ఫరవాలేదు. కోటుజేబులోనుండి బాటిల్ తీసి-యింజక్షన్ యిచ్చాను.

ఇంటికి చేరాను. ఏదో బరువు దిగిపోయింది. అయినా మనసులో ఏదో మూల మూలుగుతూంది అనుమానంతో కాబోలు. నేను యిల్లాచేయటం తప్పని ఆలోచిస్తూండగానే నిద్రపట్టింది.

తెల్లవారింది. ఎవరో తలుపులు తడుతున్నారుకాని నేను లేవలేదు. వంట మనిషి రాఘవ వెళ్ళి తలుపు తీసినట్లయ్యింది. ఎవరు వచ్చారో నేను పట్టించుకోలేదు. గదిలో బూట్ల చప్పుడు విని ముసుగుతీసి చూశాను. ఎదురుగా పోలీసిన స్పెక్టర్! చేతిలో బేడీలతో నిలబడి 'మిస్టర్ కీర్తికుమార్-యు ఆర్ అండర్ అరెస్ట్' అన్నాడు.

'వ్వాట్-యిన్‌స్పెక్టర్-వాట్ డూ యూసే' నా మత్తు వదిలిపోయింది పూర్తిగా.

'ఎస్, మిష్టర్ కీర్తికుమార్! రాత్రి మీరొక హత్య చేశారు. మునిసిపల్ పార్కుప్రక్కన పడి ఉండే పిచ్చిదాన్ని మీరు పాయిజనిచ్చి చంపారు'.

'కాని....' ముందు మాట్లాడలేకపోయాను. అప్పటికే యినస్పెక్టర్ నా

చేతులకి సంకెళ్ళు బిగించాడు. రాఘవ నా కాళ్ళు పట్టుకొని ఏడుస్తున్నాడు. విడిపించుకొని వెళ్ళి జీప్‌లో కూర్చున్నాను. జీప్ కదిలింది.

అప్పటికే ఊరంతా తెలిసిపోయినట్లుంది-నేను హత్య చేశానని.

మరునాడే అన్ని పేపర్లలో హెడ్డింగ్ న్యూస్ 'ప్రఖ్యాత డాక్టర్ శ్రీ కీర్తిబాబుపై హత్యానేరం. త్వరలోనే కేసు విచారణ'.

నేడు నా కేసు విచారణ. నన్ను బోనులో నిలబెట్టారు. ఒక్కసారి కోర్టంతా పరికించి చూశాను. నగరంలోని పెద్దలు-స్త్రీలు పురుషులు, విద్యార్థులు, నా తోటి డాక్టర్లు యింకా ఎందరెందరో హాజరయ్యారు. అంతా అల్లరిగావుంది. పోలీసులు కంట్రోల్ చేయలేక పోతున్నారు. కోర్టు బయట ఆవరణ జనంతో కిక్కిరిసిపోయింది. నినాదాలూ, అల్లర్లూ అన్నీ నాకు వినిపిస్తూనే ఉన్నాయి. 'డాక్టర్‌బాబు దేవుడు. ఒకరికి ప్రాణం పోయటమే వచ్చు కాని తీయటంరాదు. మా కీర్తిబాబుని వదలండి-అతనికి శిక్షపడిందా! ఈ కోర్టుభవనం స్మశానం అవుతుంది. అతని శిక్షకు కారకులు ప్రాణాలతో బయట పడలేరు. వారి ప్రేమకు నా మనసు ఆర్ద్రమైంది. అందరూ నావైపే చూస్తున్నారు. మాసిన బట్టలు, పెరిగిన గడ్డం, చిందరవందరగా తైల సంస్కారంలేని నెరిసిన జుట్టు, పీక్కుపోయిన ముఖం ఒకసారి తడిమి చూసుకున్నాను. అంతలోనే కేసు విచారణ మొదలైంది. కోర్టంతా నిశ్శబ్దం. ప్రతి ఒక్కరూ ఒళ్ళంతా చెవులు చేసుకొని వింటున్నారు. నా తరఫునుండి వాదనకు ఏ లాయర్నూ పెట్టుకోలేదు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ విచారణ మొదలైంది.

'మిస్టర్ కీర్తికుమార్, మీరేంచేస్తుంటారు?'-నేను గవర్నమెంట్ హాస్పిటల్లో డాక్టర్ని.

'ఐ సీ-డాక్టర్లు ఒకరికి ప్రాణదానం చేస్తారేకాని హత్యలూ-ఖూనీలూ చేయరు. కాని ఒకడాక్టరై ఉండీకూడా మీరు హత్య చేశారు. నిర్దాక్షిణ్యంగా ఒక పిచ్చిదానికి విషంయిచ్చి చంపారు. ఎందుకో చెబుతారా ?'-నేనేమీ మాట్లాడలేదు. మౌనం వహించాను.

'మిస్టర్ కీర్తికుమార్ కోర్టువారి ప్రశ్నలకు మౌనం సమాధానం కాదు. జవాబుకావాలి' - మళ్ళీ నా మౌనం.

'డాక్టర్! ఆమె మీకు శత్రువా? కాదు, 'అయితే ఎందుకు చంపారు? నాకు సమాధానం కావాలి.' ఆమె గర్భవతి-'ఐ సీ ఆమె ప్రిగ్నెంట్ అన్నమాట. అందుకే విషంయిచ్చి బలవంతపు చావుకు ఎరచేశారు. అవునా-ఆపాపం ఎవరిది?' తెలీదు. 'మీదేనేమో!' కాదు కాదు. యువరానర్! పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు హద్దుమీరి మాట్లాడుతున్నారు. ఆమెకూ నాకూ ఏ సంబంధమూ లేదు. 'అదొక పిచ్చిది'.

'ఆమెకు మీకు ఏ సంబంధం లేకుంటే-ఆమె గర్భవతి అని తెలిసి చంపటందేనికి. ఆమెకూ మీకూ సంబంధంవుంది. ఆ గర్భంమీది. అందుకే అర్ధరాత్రివేళ వెళ్ళి పాయిజన్ ఇంజక్షన్ యిచ్చి చంపారు. పిచ్చిదని తెలుసుండి, డాక్టర్ అని మరిచిపోయి నిర్దాక్షిణ్యంగా ఒకటికాదు రెండు హత్యలు చేశారు. యువరానర్! యిల్లాంటి డాక్టర్లు దేశానికే చేటు. ఇల్లాంటి హృదయం లేని డాక్టర్లు బ్రతకటానికి వీల్లేదు. వీరిపాపానికి ఉరిశిక్ష విధించినా తప్పులేదు. కాబట్టి యువరానర్! ఈయనకు కఠినాతి కఠినమైన శిక్షవిధించమని కోరుతున్నా' కోర్టంతా కోలాహలం. 'ఆర్డర్-ఆర్డర్' జడ్జిగారి ఆజ్ఞ. మళ్ళీ మునుపటి ప్రశాంతత. జడ్జిగారేం చెబుతారోనని ఊపిరిబిగబట్టి కుతూహలంగా చూస్తున్నారు అందరూను. నేనునిశ్చలంగా ఉన్నాను. జడ్జిగారు నావైపుచూసి 'ముద్దాయి తనవైపునుండి ఏమైనా చెప్పుకోవాలంటే చెప్పుకోవచ్చు.' యువరానర్! నేను కోర్టువారికి సంజాయిషీ చెప్పుకోవాలి. నిజమే. కోర్టుదృష్ట్యా యిది మహా నేరం. హత్యానేరం. ఒకటికాదు రెండు హత్యలుచేసిన నరరూప రాక్షసుణ్ణి. కాని యువరానర్! ఎందుకుచేశాను. హత్యచేయబడ్డది ఒకపిచ్చిది. ఎక్కడ పుట్టిందో యిక్కడికొచ్చింది, నాచేతుల్లో చచ్చింది. పాపం! పిచ్చిది. నాకు తెలిసినంత మటుకు నాలుగేండ్లనుండి యిక్కడే ఉంది. ఎల్లకాలం ఎండలో వానలో చలిలో ఆపార్కుప్రక్కనే రాయిలా బతికింది. నాలుగురోజుల్నుండి అనారోగ్యంతో బాధపడుతోంది కాని ఎవరూ పట్టించుకోలేదు. కాని చస్తే నేను చంపానని ఇంతరాద్ధాంతం. ఇంత అట్టహాసం. ఆమె బతికి ఉన్ననాడు ఎవ్వరూ పట్టించుకోలేదు. ఈ హోటల్లో, ఆహోటల్లో ఎవరయినావేసిన ఎంగిలి మెతుకులు తిని బతికింది. ఎవరికి ఏం అపకారం చేసింది. ఈనాడు ఆమె గర్భవతి. ఎవరివల్ల? ఇది సమాధానం లేనిప్రశ్న కదూ! దానికికారకులు బహుశా యీ కోర్టులోనే ఉండొచ్చు! ఉండకనూపోవచ్చు, కాని వారు సమాజంలో మాత్రం ఉన్నారు. నాలుగేండ్లనుండి యిష్టంవచ్చినట్లు పబ్లిక్ ప్రాపర్టీలా వాడుకున్నారు. ఒకరేమిటి ఎందరోమంది. దేశసౌభాగ్యానికి పునాదులైన యువతరం-యింకా బీటు కానిస్టేబుల్స్, చీకటిదొంగలు, రిక్షావాళ్ళు యిలాగే ఎందరో ఆమె ఉన్మాదాన్ని ఆధారం చేసుకొని అనుభవించారు. యిప్పుడు చెప్పండి! ఆమెకు గర్భంచేసిందెవరు? చీకట్లో దొంగలకు ఆమె అవసరం. దినంలో ఆమె అవసరం ఎవరికీలేదు. అట్లాంటిది బతకటం దేనికి. పిచ్చిదాన్నిచేసి అందాన్ని యవ్వనాన్ని యివ్వటంలో ఆదేవునిది నేరం. ఆమెను అవసరానికి వాడుకున్న వారిది నేరం కానీ ఆమెదికాదు. ఈ సమాజంలో ఆమెకేస్థానంలేదు. అలాంటి ఆమె గర్భస్త శిశువుకు ఉంటుందని ఏం నమ్మకం. ఈనాడు కులట-వేశ్యల సంతానమే హాయిగా బ్రతకటంలేదు. అల్లాంటిది యీ పిచ్చిదాని బిడ్డకి ఏంహాయి.

రేపు బ్రతికి, పెరిగి పెద్దదయినా ఏమవుతుంది. సమాజంలో అడుగడుగునా అపజయాలు-అపవాదులు. ప్రతిఒక్కరూ వేలెత్తి పరిహసించేవారే. ప్రతిఒక్కరూ మాటలతో చేతలతో హింసించేవారే. అల్లాంటప్పుడు ఆ బిడ్డ భవిష్యత్తు అంధకారంకావచ్చు। లేదా దారితప్పి దొంగ కావచ్చు। హంతకుడు కావచ్చు. మరేమయినా ఆశ్చర్యంలేదు.

యువరానర్ ! యీనాడు ఒక మాతృమూర్తిని హత్యజేసి బోనులో నేనున్నాను. నేను యీ బోనులో లేకపోతే యీ బోనులోనే పాతికేళ్ళ తర్వాత మీరొక హంతకుణ్ణి చూడొచ్చు. కాని యిప్పుడలా జరగదు. ఈ ప్రపంచంలోని పాపపంకిలాన్ని చూసి కెవ్వున ఏడ్వకముందే సుఖాంతమైంది ఆ బిడ్డకథ. యువరానర్ ! ఈ హత్య చేసినందుకు నేను విచారపడటం లేదు. జీవితాన్నెంతో అనుభవించాను. నాకోసం అంతగా తపించేవారులేరు. ఉన్నపిల్లలు పెద్దవారై రెక్కలొచ్చి ఎగిరిపోయారు. తోడుగాఉండే సహచారిణి ఏనాడో పోయింది. ఇన్నాళ్లు డాక్టర్‌గా నా విధి నిర్వహించా యువరానర్. దట్సాల్‌రైట్. నాకు యింకా జీవించాలని కోరికలేదు నాకు దయచేసి మరణశిక్ష విధించండి'.

'ముద్దాయి వాగ్మూలం విన్నాక-ప్రాసిక్యూటర్ వాదన ప్రకారం ముద్దాయికి యావజ్జీవ శిక్ష విధించటమైంది తీర్పు'.

నో ! యువరానర్ !! నో ! నాకు మరణశిక్ష విధించండి.' 'బాబుగారు ! బాబుగారూ !!' అని నన్ను ఎవరో కుదుపుతున్నారు. మెలుకువ వచ్చి చూశాను. ఎదురుగా వంటమనిషి రాఘవ 'అదేంటి బాబు, కలగన్నారా ! ఒకటే పలవరింతలు 'మరణశిక్ష విధించండి, మరణశిక్ష విధించండని, ఇదిగో బాబూ మంచినీళ్ళు త్రాగండి.' ఏమిటి నేను కలగన్నానా ? అయితే హత్య, విచారణ-అంతా అబద్ధమా ! అప్పటికే ఒళ్ళంతా చమటతో తడిసిపోయింది. రాఘవ ఫ్యానువేసి వెడుతూ 'పడుకోండి బాబు. యింకా చాలా రాత్రుంది. రామనామం జపించండి హాయిగా నిద్ర పడుతుంది' అని వెళ్ళాడు.

ఉదయం హాస్పిటల్లో రెండో అంతస్థులో కిటికీ దగ్గర నిలబడి చూస్తున్నాను. సిగరేట్ కాలుతోంది. ఆ పిచ్చిదాన్ని గోనెపట్టాలో చుట్టుకొని మోసుకెళుతున్నారు మునిసిపాలిటీ వాళ్ళు. ఆమె వెనక ఎవరూలేరు. కళ్ళపై నీటితెర. జోడు తీసాను. కన్నీటితెరలోంచి పిచ్చిది దూరదూరంగా మసగ్గా కనిపింపించింది. రెండు కన్నీటిబొట్లు నేలరాలాయి. అప్పటికే అ పిచ్చిది కనుమరుగయింది. ఇక ఆ ప్రహారీగోడపైపు తను చూడదు. భగవాన్ క్షమించు. కథ నీది ముగింపు నాది.



# పెరిగిన మతతత్వంలో తరిగిన మానవత్వం

యస్సే. నజీర్

అది నాలుగుదార్ల కూడలి. ఈశాన్యంగా ఒకశవం, ఏకాకిగా పడివుంది.

సాయంకాలం ఐదయింది. ఫ్యాక్టరీలనుండి, ఆఫీసులనుండి కార్మికులు, చిరుద్యోగులు, తదితరులు దేవుడు సమర్పించిన కాళ్ళతో నడిచివస్తున్నారు.

వారిలో కొందరినా శవం ఆకర్షించింది. ఆకర్షించిందంటే అదేమంత అందమైన శవంకాదు. కనీసం ఆడమనిషి శవంకూడాకాదు. భయంకరమైన కుష్ఠువ్యాధితో-చర్మమంతా నల్లబడి కాళ్ళవేళ్ళు చేతులవేళ్ళు అంతకుముందే జీర్ణింపబడివున్న శవం అది. శరీరమంతటా పుండ్లనుండి రక్తంస్రవించి, గడ్డకట్టి; నాటకంలో కుష్ఠువాడి వేషంలావుంది. కాకపోతే చలనశూన్యం.

దగ్గరసావెళ్ళిన పుణ్యాత్ములకు దుర్గంధభూయిష్టమైన గాలి, శవంనుండి పిల్లతెరలుగా వాళ్ళముక్కుపుటాలకు సోకి సున్నితంగా వాళ్ళవేళ్ళతోనే, వాళ్ళ ముక్కులను పట్టుకునేట్లు చేసింది.

పదికి ఇరవైమందయ్యారు. ఇరవైకి ముప్పైమందయ్యారు .... ఇలా పెరుగుతూనేవున్నారు జనం. పదుగురు చేరినతర్వాత యిక కోలాహలం తప్పదు. ప్రారంభమయ్యాయి గుసగుసలు, కేకలు. కొందరు ఆ శవంగురించి కథలుకూడా అల్లేశారు. కొంత తెలిసీతెలియనివారు గోరంతలు కొండంతలు చేశారు.

'బ్రతికున్నప్పుడు ఎంతమంచిగా వుండేవాడో ! ఎవర్నీ నోరువిడిచిగాని, చెయ్యెత్తిగాని, కనీసం కన్నెత్తయినా ఏదీ అడిగేవాడుగాదు....పాపం ! ఎవరైనా ఏదైనాపడేస్తే ఆప్యాయంగాతిని, ఈచెట్టుకింద పడుకునేవాడు' ఒకమనిషివ్యాఖ్య.

'మూగవాడో, గుడ్డివాడో అయ్యుంటాడు' రెండోమనిషి.

'కామోసు....కాని చెయ్యెత్తి అడగొచ్చుగా ?....పాపం ఎన్నిబాధల ననుభవించాడో !' మొదటివ్యక్తి సానుభూతి వ్యక్తపరిచాడు.

'పైగా కుష్ఠువ్యాధికూడా !' మూడోవ్యక్తి.

'బ్రతికిచెడిన మడిసి-నాకీతడు బాగాతెలుసు....ఒకటీ రెండుసార్లు 'యాం

అల్లాహ్' అనడం నేను ఇటునుంచి వెళ్ళేటప్పుడు విన్నాను. కాబట్టి ఇతను ముస్లిం' చిరుగడ్డమున్న ఒక ముస్లిం అన్నాడు.

'మీరు భలేవారండి! ఈ మనిషి హిందువు. నేను నా చెవులారా 'హరే కృష్ణ హరేకృష్ణ హరేకృష్ణ'-అనడం ఆ! నేనేకాదు చాలామంది విన్నాం.... ఏరా! రంగారావూ!' ఒక హిందూ అభిమాని ముస్లింతాత చెప్పినదాన్ని ప్రతిఘటించాడు.

'నేను ఇలా ఈ చెట్టుప్రక్కనుంచి వెళ్తుంటే, చెవులో గుసగుసగా, కొన్ని బ్రాకెట్ అంకెలు వినిపించేవి; ఆ అంకెలే ఆరోజు బ్రాకెట్ అయ్యేది. కాబట్టి ఇతను మహిమగలవాడు. వెంటనే మనమందరంకలిసి ఇతనికి దహన సంస్కారం చేద్దాం' బ్రాకెట్ అంటే పడిచచ్చే మనిషి అన్నాడు.

'అవునవును.... నేను సస్పెన్షన్‌లో వున్నప్పుడు కలలో కన్పించి, నీవు డ్యూటీలో రేపు చేరిపోతావు-అన్నాడు, అట్లాగే జరిగింది. కాబట్టి ఇతడు మంచి మహిమగలవాడు. ఇతన్ని తప్పకుండా కఫన్-దఫన్ చేయాల్సిందే'-ఒక ముస్లిం మధ్యవయస్కుడు అన్నాడు.

పసిమిరంగు శరీరం, నుదుటను వైష్ణవనామాలు, పిలకతో ఒక సద్బ్రాహ్మణుడు గుమిగూడిన జనాన్ని నెట్టుకుంటూ 'ఈ అధర్మాన్ని సహించలేము. ఈతడు ముమ్మాటికీ హిందువు. హిందూ సాంప్రదాయప్రకారం దహనక్రియలు జరపాల్సిందే.... చూస్తారేం! చందాలు వసూలుచేయండి. ఈ సాయిబులందర్నీ వెళ్ళిపొమ్మనండి. హిందూధర్మాన్ని రక్షించండి' అక్కడున్న హిందువులకు సందేశమిచ్చాడు.

అక్కడేవున్న మౌల్వీసాహెబ్; ముఖారవిందాన్ని విచారమయం చేస్తూ గద్గదంగా 'ఈతడు హిందువని చెప్పేవారితల బ్రద్దలవుతుంది.... యాఁ అల్లాహ్-ఈ ప్రపంచంలో ముస్లింధర్మం నశిస్తోంది.... పవిత్రమయిన ముసల్మానుని పట్టుకొని హిందువంటున్నారు ఈ కాఫిర్లు; ఈ శవాన్ని దఫన్ (ఖననం) చేస్తానికి మాకు శక్తినీయ్ యా ఖుదాఁ! యా పర్వర్ దిగార్.'

'అయ్! ఈ అన్యాయం చెల్లదు. హిందూధర్మం నశించడానికి వీల్లేదు-శ్రీరామా! దీనరక్షకా! సాంప్రదాయ హిందూకులీనుణ్ణి పట్టుకొని ముస్లిం అంటున్నారు ఈ మ్లేచ్ఛులు. శ్రీరామా! నీలమేఘశ్యామా! ఈ శవదహనానికి మాకు తగినంత శక్తినివ్వు భగవంతుడా!....రామకృష్ణ, కృష్ణకృష్ణ, హరేహరే! ....హిందూ మహాజనులారా! ఇక్కడ మనకెదురుగావున్న శవం, శవంకాదు-

సాక్షాత్తు పరమేశ్వరుడు మనకు పెడ్తున్న అగ్నిపరీక్ష. మన భారతదేశంలో అనాదిగా హిందూధర్మంకోసం అనేకులు బలిదానం చేశారు; చేసినట్లు మన పురాణాలూ, చరిత్రా చెబుతున్నాయి. నేడు ఈ ధర్మార్థసమరంలో, ఈ పరిస్థితిలో; ఏరులు ఏకమైనా, నదులు కల్లోలమైనా, మనం ఈ శవాన్ని హిందూ ధర్మ ప్రకారం దహనపర్చవలసినదే' ఒగరుస్తూ నిలబడిపోయాడు.

'నహీఁ! శవదహనం అవటానికి వీల్లేదు! మా ధర్మప్రకారం ముస్లిం సాంప్రదాయప్రకారం ఈ శవాన్ని దఫన్ చేయాల్సిందే! ఆరు నూరైనా, నూరు ఆరైనా సరే!....ముస్లిం భాయిలోగ్! ఎంతో ఉచ్చదశలోవున్న ముస్లిం ధర్మం మంటగలిసిపోకుండా, నేడు మనం, మన ముస్లింభాయి శవాన్ని మన ధర్మంప్రకారం కఫన్ దఫన్ చేయాల్సిందే. చందాలు వసూలు చేయండి. మన ఈ పుణ్యకార్యానికి ఖుదాఁ మనవెంట వుంటాడు!' మేల్వీ సాహెబ్ అభయ మిచ్చాడు.

అప్పటికే జనం బాగా గుమిగూడారు రెండుపక్షాలుగా ఏర్పడ్డది ఆగుంపు. ఇరుపక్షాలలోనూ చందాలు వర్షం కురిసినట్లు ప్రవహించాయి.

మరికొంత సేపటికి వాతావరణం ఉద్రిక్తంగా మారింది. 'శవాన్ని మేము తీసుకు వెళ్ళాలంటే మేము' అని వాదించుకున్నారు. చివరకు దౌర్జన్యానికి కూడా దిగారు.

కర్రలూ, షోడాబుడ్లూ, ఇటుకలూ, చివరికి దొరికినంత వరకు కత్తులు కూడా చేతుల్లో కనిపించాయి. బాకాలు ఊదటమే ఆలస్యం క్షణంలో రణరంగంగా మారబోతోంది. అగ్నికి ఆజ్యం తోడయినట్లు, ఉద్రిక్తను పెంచే ఉపన్యాసాలు ఇరుపక్షాలలోనూ మరింత ఎక్కువయ్యాయి. అందరి కళ్ళూ ఎఱ్ఱబడ్డాయి.

'వీరులారా! వీరయువకులారా! మిమ్మల్నెవ్వరూ ఏమీచేయ లేరు. ఈరోజు అల్లాహ్ పరువు మీచేతుల్లో వుంది. ఈ పవిత్రశవం; మన ముస్లిం సోదరునిది. కాఫెర్ల (ముస్లిమేతరులు) చేతుల్లోనికి పోనివ్వకండి. ఇస్లాం ధర్మాన్ని రక్షించండి.' ఒకపక్షంనుండి ఉపన్యాసం.

'నవయువకులారా! పృథ్వీరాజు, పురుషోత్తములనుకున్న భారతదేశ వాసులారా! పదండి ముందుకు. అతి పవిత్రమయిన ఈ శవాన్ని, ఈ మ్లేచ్ఛులను తాకనీయకుండా, దరికి రానియ్యకుండా చేయండి. బలరామ కృష్ణుల కృపవల్ల ఈ మహావ్యక్తి శవానికి దుర్దశరాదు. మీ మీ భుజబలంతో; ఈ మ్లేచ్ఛుల కూతలను అరికట్టండి. పదండి ముందుకు' రెండవపక్షం ఉపన్యాసం.

'హర హర శంభో! శ్రీరామునికీ జై...శ్రీకృష్ణ పరమాత్మకూ జై' నినాదాలతో భూమి కంపించింది.

'నాంహేతక్బర్, అల్లాహో అక్బర్!' ఆకాశం చిల్లులుపడి మెరుపులు మెరిశాయి.

ఇరుప్రక్కల యువకుల కళ్ళల్లోంచి అగ్నికురిసింది. ఎవరి ధర్మం వారు రక్షించుకునే యత్నంలో మానవత్వాన్ని మట్టిలో కలిపివేశారు.

ఎవరి మతాన్ని, ఎవరి మతధర్మాన్ని వారు కాపాడుకోవచ్చును. కాని, అర్థంలేని తత్వాలతో పరులకు హానికల్గించే విధంగా ప్రవర్తించడమే పెద్దపొరపాటు. అది సహించలేనిది......ఏమతం కూడా సమ్మతించలేనిది. నీ మతం కాపాడుకో! కాని పరమతాన్ని ద్వేషించకు. దూషణలే భీషణ సమరంగామారిన రోజులున్నాయి; జరుగుతున్నాయి కూడా.

ఒకరిపై ఒకరు వురికే యత్నంలో అందరిదృష్టి కారణ భూతమైన శవం నుండి దూరమైంది.

ఒక కుక్క ఎంతో సేపట్నించి నిలబడి ఒకకంట అక్కడ జరుగుతున్న తతంగం అంతా చూస్తూంది; మరోకంట శవానికున్న పుండ్లను ఆశగా చూస్తూంది. ఆ కుక్కకి నాల్గురోజుల బట్టి ఆహారం లేక నకనకలాడుతూంది. ఆకలితో వున్న ఆకుక్కకు, పడివున్న శవం మనిషిదో, జంతువుదో గమనించే ఓపిక లేకపోయింది.

అందరి దృష్టి, శవంనుండి తప్పుకోగా; శవానికి దగ్గరసాపోయి కనిపిస్తున్న ఎఱ్ఱటి మాంసాన్ని నోటితో లంకించుకుంది. శవంలో చలనం ఏర్పడింది. ఆ హటాత్పరిణామానికి కుక్క భయపడి అరుచుకుంటూ పారిపోయింది.

'ఓహ్....హు....' శవం శక్తిహీనంగా మాట్లాడింది.

మెల్లిగా వత్తిగిల్లింది.

'మ.....మ.....మం.....చి.....నీ.....ళ్ళు' మందస్వరంతో, నీరసంగా పల్కాడు శవంగా భ్రమింపజేసిన వ్యక్తి.

షోడాబుడ్లు, కఱ్ఱలు, ఇటుకలతో యుద్ధానికి తలపడిన ఇరుపక్షాలు ఆశ్చర్యంగా, పడివున్నతని వైపు చూశాయి.

ఇరుపక్షాల నాయకులు పడివున్నతనివైపుకు వెళ్ళారు.

'మం....చి....నీ....ళ్ళు....మం....చి....నీ....నీ....ళ్ళు....' ఆ కుష్ఠురోగి దీనంగా అడిగాడు.

'నువ్వెవరవు?' మంచినీళ్ళ సంగతి పెడచెవినపెట్టి మౌల్వీసాహెబ్, బ్రాహ్మణ పుంగవులిద్దరూ ముక్తకంఠంతో అడిగారు.

'మం....చి....నీ....ళు....' సమాధానం.

'నువ్వే జాతీయుడివి? హిందూవా? ముస్లిమువా?' బ్రాహ్మణ పుంగవుడు అడిగాడు.

'నీవు ముస్లిమువా, హిందూవా?' మౌల్వీ సాహెబ్ తిరిగి అడిగాడు.

'మ....మ....ం....చి....నీళు' మెల్లిగా కష్టంపై సైగచేస్తూ అడిగాడు.

అక్కడున్న జనం కూడా, అతడిది ఏ జాతియో తెలుసుకోవాలనే ప్రగాఢ కాంక్షతో వున్నారు. అందరూ చెవులు రిక్కించి విన్నారు.

'నువ్వెవ్వరవు?' ఇద్దరూ ముక్తకంఠంతో గద్దించారు.

లోతుకుపోయిన కనుగ్రుడ్లతో ఒకసారి ఇరువురివంకా చూశాడావ్యక్తి- మెల్లిగా 'మానవుడిని' అన్నాడు.

'జాతి....మాక్కావలసింది జాతి....నువ్వు ముస్లింవి కదూ!

'నువ్వు హిందూ మతస్తుడివి కదూ!'

'నే....నే....ను....హు....హు....ష్....అ....బా....ఏ....సు.... కీ....రీ....స్తు....మి....మ....లి....ని....ర....క్షి....ం....చు....గా....క.... మంచి....చి....నీ....నీ....ళు....' నాలిక వ్రేళ్ళబెట్టి ఆరోగి తల వాల్చేశాడు. అతని ప్రాణం అనంత వాయువులో లీనమైపోయింది.

'వెధవ!...కుష్టువెధవ! ఎంత అవస్తపెట్టాడు. క్రీస్తట క్రీస్తు... ఇంకానయం-చెప్పిచచ్చాడు...త్వరపడి ముట్టుకోలేదు ఎంత అపచారం! ఎంత అపచారం! రాముడు దేవుడు కాదా! కృష్ణుడు భగవంతుడు కాదా!'

'హరామ్ ఖోర్! కాఫిర్! సువ్వర్ కా బచ్చా!...మమ్మల్ని మతలబు చేస్తావా!...అల్లాహ్ మమ్మల్ని క్షమించు త్వరపడి కాఫిర్‌ని దఫన్ చేయలేదు. నీ ధర్మాన్ని నువ్వే రక్షించుకున్నావు'.

'పదండి, పదండి....మనకిక్కడేంపని?...అనవసరంగా సమయంపాడు చేసుకున్నాం...పదండి...మనం వెళ్ళినతర్వాత మున్సిపాలిటీ వాళ్ళొచ్చి శవాన్ని తీసుకుపోతారు'.

మరుక్షణం ఆ ప్రదేశమంతా ఖాళీ అయింది.

చివరకు మిగిలినవి కుష్టిరోగిశవం, ఆకలితో నకనకలాడుతున్న శునకం.



# పరిచయాలు



మాష్టర్ రవి

అసలుపేరు: దేవరాజు వేంకటసత్యనారాయణరావు. సూపర్‌వైజర్; గవర్నమెంటు లెప్రసీ కంట్రోల్ ప్రాజెక్టు, పొంగిరి. వయస్సు: 33. అభిరుచులు: చదవడం, రాయడం, ఉపయోగపడే సంభాషణ చెయ్యడం.

సైబ పరంధాములు

ఉపాధ్యాయులు. వయస్సు: 28. అభిరుచులు: చిత్రలేఖనం, పఠనం, రచనావ్యాసంగం, సహృదయుల స్నేహం.

చక్రపాణి

అసలుపేరు: వాడపల్లి చక్రపాణిరావు. ఉపాధ్యాయులు, ఎస్. కె. బి. ఆర్. కాలేజ్, అమలాపురం. స్వస్థలం: వాడపల్లి. వయస్సు: 26. అభిరుచులు: ఊహావిహారం, తీరికా, మూడ్ కుదిరినప్పుడు కథలూ, గేయాలూ వ్రాయడం. ఇతర రచనలు వివిధ పత్రికలలో ప్రచురితాలు.

జయానాగరాజ

డాక్టర్, మానసికవేత్త. వయస్సు: 40. అభిరుచులు: కథలు, భావగీతాలు, రచన, సంగీతం, నృత్యం, ఛాయాగ్రహణం, అభినయం (నాటకాలు), రీసర్చి.

### మలిశెట్టి జానకీరామ్

అధ్యాపకులు. వయస్సు: 35. అభిరుచులు: వ్యాసాలూ, కథలూ, గేయాలూ వ్రాయటం. ఇతర రచనలు వివిధ పత్రికలలో ప్రచురింపబడినవి.

### చింతకుంట మురళీధరరావు

జీవిత భీమా సంస్థలో, హైదరాబాదు. వయస్సు: 23. అభిరుచులు: సాహిత్యం, సంగీతం అభిమాన కళలు. స్నేహితులతో కాలక్షేపంచేయడం సరదా.

### కాళ్ళూరు వెంకటరామప్రసాద్

జీవిత భీమా సంస్థలో హైదరాబాదు. వయస్సు: 30. అభిరుచులు: చారిత్రక సాంస్కృతిక యాత్రా స్థలాలను సందర్శించటం, సాహితీపఠనం.

### బొమ్మిరెడ్డిపల్లి వెంకటశకుంతలా భానుశ్రీ

విద్యార్థిని. వయస్సు: 20. అభిరుచులు: సాహిత్యము, చిత్రకళ, ఫోటోగ్రఫీ.

### నాగరంజని

అసలుపేరు: వసంతరావు దేశపాండే. బి. ఎస్. సి. విద్యార్థి. వయస్సు: 20. అభిరుచులు; రచన, నటన, పుస్తకపఠనం, దర్శకత్వం.

### సయ్యద్ నజీర్ అహమ్మద్

కంపోజిటర్, రైల్వే ప్రింటింగ్ ప్రెస్. వయస్సు: 28. అభిరుచులు: చదవటం, వ్రాయటం, కలంస్నేహం.

# మా గురించి



మనిషిలో అంతర్లీనంగా నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సార్థక్యానికీ, సృజనాత్మక శక్తికీ సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం ఏర్పడుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

ఆలోచనా స్వేచ్ఛ దేశ పురోగతికి దోహదం కలిగించే విధంగాను కళాసృష్టికి ప్రతిభావ్యుత్పత్తులు ప్రాతిపదికలు కాగలిగే విధంగాను, వ్యక్తిత్వ నిర్మాణం సాంఘికాభ్యుదయంతో పెనవేసుకొనిపోయే విధంగాను, సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలను సజీవజాతి నిర్వహించుకుంటుంది. ప్రజాస్వామ్య వ్యవస్థకు నారుపోసేవీ నీరుపోసేవీ ప్రతిభాసౌమనస్యాలే.

యువభారతి కడచిన పదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతిని అందంగా శక్తిమంతంగా అర్థవంతంగా మాట్లాడగలిగే సామర్థ్యాన్ని రచించగలిగే నైపుణ్యాన్నీ, ఎదుటివారి అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్నీ, ఆలోచనను రేకెత్తించి వివేకాన్ని ఉద్దీపింప చేయగలిగే అధ్యయనశీలతనూ, అలవరచేందుకు విభిన్న దృక్కోణాలతో రూపొందించి నిర్వహిస్తున్నది.

సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఉత్తమ సాహిత్యాన్ని ప్రజానీకానికి అందిస్తే సాహిత్యంపట్ల అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ పూర్వవిరాళ పద్ధతిని ప్రవేశపెట్టి సరస్వతీ సాక్షాత్కారం, జీవనగీత, కావ్యలహరి, చైతన్యలహరి, వికాసలహరిలవంటి సాహితీ తపోమూర్తుల సందేశాలనందించే గ్రంథాలను వేనవేల సంఖ్యలో ప్రచురించి ఉభయ నగరాలలోని రసికులనేగాక యావదాంధ్ర దేశంలోని సాహితీప్రియుల మన్ననలను పొందగల్గింది. 'మారుతున్న విలువలు'—'రచయితల బాధ్యతలు' అనే ఒక గోష్ఠిని

నిర్వహించి ఆ గోష్ఠి వ్యాసాలను 'రచన'గా ప్రచురించింది. భారత స్వాతంత్ర్య రజతోత్సవ సందర్భంగా కడచిన 25 ఏళ్ళలో తెలుగుదేశంలో సాంస్కృతిక సాహిత్య భాషా సంబంధమైన తీరుతెన్నులను వివరిస్తూ నూరుగురు ప్రముఖుల వ్యాసాల సంపుటిని 'మహతి'గా ప్రచురించింది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలేందుకు రసికులకు సాహితీమిత్ర పథకాన్ని రూపొందించింది. సహృదయులను అన్వేషిస్తూ యువభారతి చేసిన కృషికి ఫలితంగా ఇప్పటికి దాదాపు మూడువేల ఐదువందలమంది సాహితీమిత్రులుగా చేరినారు. ఈ సాహితీమిత్రుల సాహితీవికాసానికి తోడ్పడేందుకు ఒక కవితా సంకలనం 'ఉషస్సు'ను 'కథావాహిని' అనే రెండు కథాసంకలనాలను ప్రచురించింది. యువభారతి సభ్యుల కవితా, కథాసంకలనాలు 'వీచికలు—అక్షరాలు—స్వరాలు—ఉదయం" కూడ వెలువడినవి.

జంటనగరాలలో వేనవేల సంఖ్యలలో భాషాభిమానులను ఆకర్షించి పెద్ద ఎత్తున సాహిత్యసభలను నిర్వహించగల్గింది.

తెలుగు సాహిత్యంగురించి తెలుగువారికి తెలపడమేకాదు. అన్యభాషీయులకుగూడా తెలుప బూనుకోవడంలో ఔచిత్యముందని అలాగే అన్యభాషా సాహిత్య సంస్కృతుల విశేషాలను తెలుగువారు తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉందని మా విశ్వాసం. దీనికి నాందిగా 37 ఇంగ్లీషు వ్యాసాల సంకలనం "Free India Forges Ahead" ను వెలువరించింది. నూరేళ్ళ తెలుగు నవల ప్రపంచ సాహిత్యానికి అందించిన కానుకగా చిరకాలం నిలువగలిగే దాదాపు ఇరవైరెండు నవలలను గురించి సాహిత్యాత్మక పరిచయ వ్యాసాలను ఇంగ్లీషులో వ్రాయించి 'Telugu Novel' గా 1974 జనవరిలో వెలువరించనున్నది.

1974లో 'యువత' గోష్ఠిని నిర్వహించడానికి ప్రణాళికను సిద్ధంచేసింది. దేశంలో యువకులు నిర్వహించిన, నిర్వహిస్తున్న, నిర్వహించవలసిన పాత్రను గూర్చి ఈ గోష్ఠిలో చర్చలు జరుగుతాయి. దాదాపు 70 వ్యాసాల సంకలనం 'యువత' అనే పేరుతో వెలువడుతుందికూడా.

ఉడుతాభక్తితో మేముచేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు, వారి సౌహార్దం, భాషాప్రియత్వం. ఇదే మా పెట్టుబడి. మా తపస్సు, ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం, సామరస్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షుడు.

విజయదశమి
7—10—1973

యువభారతి

# యువభారతి
# ప్రచురణలు



| | | | |
|---|---|---|---|
| 1. | సరస్వతీ సాక్షాత్కారం-అనుముల కృష్ణమూర్తి (కావ్యం) | రు. | 3-00 |
| •2. | జీవనగీత-కాళోజి (ఖలీల్ జిబ్రాన్ The Prophet కు తెలుగు | రు. | 2-5[illegible] |
| •3. | వీచికలు (కవితా సంకలనం) | రు. | 2-[illegible] |
| •4. | పంచవటి (కథల సంపుటి) | రు. | 2-[illegible] |
| 5. | రచన (మారుతున్న విలువలు-రచయితల బాధ్యతలు-వ్యాససంపుటి) | రు. | 7-00 |
| •6. | కావ్యలహరి-ఆచార్య దివాకర్ల వేంకటావధాని | రు. | 5-00 |
| •7. | అక్షరాలు (కవితా సంకలనం) | రు. | 2-00 |
| 8. | చైతన్యలహరి-ఉపన్యాసమంజరి | రు. | 6-00 |
| 9. | మహతి-(నూర్గురు ప్రముఖుల వ్యాస సంకలనం) | రు. | 20-00 |
| 10. | ఫ్రీ ఇండియా ఫోర్జెస్ ఎహెడ్ (34 వ్యాసాల సంకలనం) | రు. | 10-00 |
| 11. | స్వరాలు (కవితా సంకలనం) | రు. | 3-00 |
| 12. | ఉషస్సు (యువభారతి సాహితీమిత్రుల ఉగాది కవితాసంకలనం) | రు. | 3-00 |
| 13. | మళ్ళీవెలుగు-శ్రీ శీలా వీర్రాజు (వచన కవితా కావ్యం) | రు. | 4-00 |
| 14. | ఉదయం (యువభారతీయుల కథా సంకలనం) | రు. | 2-00 |
| 15. | కథావాహిని-1 (యువభారతి సాహితీమిత్రుల కథాసకలనం) | రు. | 2-00 |
| 16. | కథావాహిని-2 ,, ,, | రు. | 2-00 |

• ఈ గుర్తుగల పుస్తకముల ప్రతులు లేవు.

*** సాహితీమిత్రులకు ప్రత్యేక తగ్గింపు**









సమాజంలో సాహిత్యం
కావ్యలహరి చైతన్యంలా
సవలాన్యం చేయాలని
యువభారతి లక్ష్యం!
సాహితీ మిత్రులుగా
యువభారతి సంస్థ మీకు
ఆహ్వాన మందిస్తున్నది

సాహిత్యకళా సంస్కృతి సాధనకూ
సమ్యక్ శోధనకూ
విస్తృత స్నేహారాధనకూ
విశ్వశ్రేయ స్సాధనకూ
'సాహితీమిత్ర' పథకంలో
సభ్యులుగా చేరండి
విశేషాలకు, వివరాలకూ

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

యువభారతి సాహితీచైతన్యంతో పదోవసంతం ప్రచురణలు



మందార
మకరందాలు

